# 3. వైరాగ్యశతకము.

చూడోత్తంసితచన్ద్రచారుకళికా—

శశిరుచిశిఖమునఁ జేరియో, దశధామము కామశలభదగ్ధము మోహం

ధశమము నగుశివదీపస్మరణ వెల్లూరి వేంకటాచలరమణా. ౧

భ్రాన్తం దేశ మనేకదుర్గవిషమం—

వలుబాము లరుగఁ గాకము, వలె దుష్టాన్నము భుజించు ఫలమందక హీ

నులఁ గొల్వఁ దృష్ణచే నరుఁ, డలరును వెల్లూరి వేంకటాచలరమణా. ౨

ఉత్ఖాతం నిధిశఙ్కయా క్షితితలం—

ఇలఁ ద్రవ్యనోడ జేరము, నలువఁగ హేమింప రాజసచ్ఛ్రుతి మంత్ర

ములు గలుగ గవ్వ దొరకునె, యలరఁగ వెల్లూరి వేంకటాచలరమణా. 3

ఖలాలాపాస్సోఢాః—

కనుల నీరుంచు నగుఁ డి, ట్టిన నూరకయుండు బడిబడిగ ధనికున కం

జలిచేయుఁ దృష్ణచే నరుఁ, డలరును వెల్లూరి వేంకటాచలరమణా. ౪

అమీషాం ప్రాణానాం—

నలజలతుల్యప్రాణ, మ్ములకై యిల ధనాంధులకడ మూఢులు పాప

మ్ములనక తముఁ దామెన్నరు, రలరఁగ వెల్లూరి వేంకటాచలరమణా. ౫

క్షాంతం న క్షమయా—

క్షమ లేక శాంతి సంతో, షము లేక విరక్తి యోగచరితము లేకన్

హిమసూర్యాతపసహనం, బమరదు వెల్లూరి వేంకటాచలరమణా. ౬

భోగా న భుక్తా వయమేవ—

ఇల భోగకాలతృట్తప, ములు భుక్తమె శిథిలజీర్ణములె తప్తములే

ఫలభోక్తలు మనుజులె కా, కలరఁగ వెల్లూరి వేంకటాచలరమణా. ౭

వలిభిర్ముఖమాక్రాన్తం—

తల నరసిన మోమున వళు, లలరినఁ గాయంబు శిథిలమైనప్పుడు మ

ర్త్యులతృష్ణ వాయదేమన, నలవడు వెల్లూరి వేంకటాచలరమణా. ౮

నివృత్తా భోగేచ్ఛా—

కనులఁ బొర గప్ప బహుమతి, చనఁ జేతికిఁ గోల రాఁగ సఖులరుగ సుఖం

బణఁగ మొయితృష్ణ చనదే, మనవలె వెల్లూరి వేంకటాచలరమణా. ౯

ఆశానామనదీ—

ధృతికుజహరము మనోరథ, తతికము తృష్ణోర్మికము వితర్కఖగము రా

గతిమగు నాశానది * దాఁటతరమె వెల్లూరి వేంకటాచలరమణా. † ౧౦

అవశ్యం యాతారః—

నిలువవు విషయసుఖము లవె, తొలఁగిన దుఃఖంబుతా నెతొలఁగించిన ని

శ్చలసుఖ మపరిమితం బై, యలరును వెల్లూరి వేంకటాచలరమణా. ౧౧

బ్రహ్మజ్ఞానవివేకనిర్మలధియః—

అనఘుఁడు లభించుభోగము, లను రోసి త్యజించుఁ బరుఁడు లభియింపనివై

నను గోర్కులుమగఁజాలం, డనుపుగ వెల్లూరి వేంకటాచలరమణా. ౧౨

ధన్యానాంగిరికన్దరేషు—

పులుఁగులు తోడ నాడశ్రువు,లోలుకఁగ ధ్యానించు గుహాలయోగివరుఁడుమే

డల వనిక్రీడల నెప్పటి, కలరుఁగ వెల్లూరి వేంకటాచలరమణా. ౧౩

భిక్షాశనం తదపి నీరసం—

ఇల నజ్జగ నుంకియుఁ జిం, పులబొంతయుఁ గప్పి బికిరపుంగూడుదిన

య్యాలు నై తము మోహముడుగ, రలరఁగ వెల్లూరి వేంకటాచలరమణా. ౧౪

స్తనౌమాంసగ్రన్థి—

ఇలఁ జీమిడిబుఱ్ఱలుమోముములు రోఁతలు కటుఁ బొంగాలసుముద్దలు కుచముల్

నెలకరిఘుటములు వసుకుం, డలగు నె వెల్లూరి వేంకటాచలరమణా. ౧౫

ఏకోరాగిషు రాజతే—

గిరిజ మెయిఁ గలుగుహరుఁడొ, క్కరుఁడే రాగియు విరాగి గతకాముకుఁ డే

వరు లుభయభ్రష్టులు గద, యరయఁగ వెల్లూరి వేంకటాచలరమణా. ౧౬

అజానన్దాహాత్మ్యం—

శలభము లగ్ని దుముకుఁ జే, పలుగాలముమ్రింగుఁ దెలివివాసి మనుష్యుల్

తెలిసియు మోహముడుగరే, రలరఁగ వెల్లూరి వేంకటాచలరమణా. ౧౭

తృషా శుష్యత్యాస్యే—

మనసిచ్చయించ వనితల, నెనయుం దప్పినఁ ద్రావు నీరాఁకలికిం

దిను భక్ష్యాన్న మిదిసుమా, యనుశ్రీ వెల్లూరి వేంకటాచలరమణా. ౧౮

---

* దాఁటుఁదరమె- యనినఁబాసిభంగము- ఇట్టివిందుఁబెక్కుకలవు.

† దీనికి [illegible] "సంసార [illegible]ప్నం" అనుదానికిఁ బద్యములేదు.

తుఙ్గం వేశ్మ సుతాస్సుతాం—
ఇలు దార యౌవనము తన, యలుఁ దిర మని మోహకార నుండజ్ఞుఁడు జ్ఞా
నులు నిత్యము గాదని మొద, రలరఁగ వెల్లూరి వేంకటాచలరమణా. ౧౯
దీనాదీనముఖైః—
తనయులు క్షుధ నవ్వాబు, వ్వని జీర్ణపటంబు దిగువ నడిగని దేహీ
యనుఁగాని ఘనుఁడుతనకొలఁది, కనునా వెల్లూరి వేంకటాచలరమణా ౨౦
అభిమతమహామాన గ్రన్థి—
ఘనగుణవలచంద్రిక స్త్రీ, వనివరసు మానహరణపటువు కడుపు నిం
డనిబాన మెవరి నెటుసే, యనిదవు వెల్లూరి వేంకటాచలరమణా. ౨౧
పుణ్యేగ్రామే వనే వా—
సరివారి నడుగుకంటెను, వరపుణ్యస్థలముచేరి పాలుఁలయిండ్లం
దిరిప మడిగి కుడుచుట మే, లరయఁగ వెల్లూరి వేంకటాచలరమణా. ౨౨
గఙ్గాతరఙ్గకణశీకరశీతలాని—
చలిమలనెలవులు గంగా, జలశీతల మునివనములు చనెనె బుధులు దు
ష్టులఁజేరి కూటికడిగెద, రలరఁగ వెల్లూరి వేంకటాచలరమణా. ౨౩
కుశన్దాః కన్దరేభ్యః—
ఫలకందమూల జలవ, ల్కలములు లేవె, ధనగర్వకచలదుర్భాచా
పులనృపులఁగొల్వఁగా మఁద, మలరునె వెల్లూరి వేంకటాచలమరణా* ౨౪
ఫలం స్వేచ్ఛాలభ్యం—
కొలఁకులఁ జల్లనిజలములు, ఫలములు వృక్షములు పల్లవక్షితిశయ్యల్
గలుగ ధనికు కొలువేమిటి, కలరఁగ వెల్లూరి వేంకటాచలరమణా. ౨౫
ఏవర్తన్తే ధనపతిపురః—
మనుజేంద్రాశ్రయదుఃఖం, బున భోగసుఖముల దినము వోయెనని నగుఁ
వని ధ్యానాంతంబున బుధుఁడనయము వెల్లూరి వేంకటాచలరమణా. ౨౬
యేనన్తోషనిరన్తరప్రముదితాః—
పరితుష్టులేమిగోరరు, ధర లుబ్ధులు మేరుభూమిధర మగపడినం
బరితోషముఁజెందరు పుర, హరసఖ వెల్లూరి వేంకటాచలరమణా. ౨౭
భిక్షాహారమదైన్యమప్రతిమసుఖం—
దురితహర మభయ మక్షయ, కరమప్రతిహతము యోగికామితముచు కం
కరసత్రముభిక్షాశన, మరయఁగ వెల్లూరి వేంకటాచలరమణా. ౨౮



* ఆన్యేన్యమ్లఫలైః-అను దానికిఁ బద్యము లేదు.

భోగేరోగభయం—

బలభోగవిత్తవిద్యా, కులములకుభయ మరిరోగకుప వాదిహతం
బులు నభయము వైరాగ్యం, బలరఁగ వెల్లూరి వేంకటాచలరమణా. ౨౯

ఆక్రాన్తం మరణేన—

జర వయసును నస్థైర్యము, సిరి నాశముఁ దోషణాబు చిలువ వనము సు
దరిశమము సొంపరంజే, యరయఁగ వెల్లూరి వేంకటాచలరమణా* 3౦

భోగాస్తుఙ్గతరఙ్గభఙ్గతరలాః—

తరుణత్వ మస్థిరము కా, పురములు తుచ్ఛములు విభవములు వీచులు వా
నర మల్పమని బుధుఁడు సుఖ,మరయును వెల్లూరి వేంకటాచలరమణా. 3౧

భోగామేఘవితాన—

పవనచలితాభ్రకము నా,యువు తుచ్ఛలు స్త్రీలు మెఱుపులు భోగములం
చవని బుధుఁడు చిత్సాధకుఁ,డవు శ్రీవెల్లూరి వేంకటాచలరమణా. 3౨

ఆయుః కల్లోలలోలం—

మెఱుపులు భోగము లర్థమ చిర మాయువు వీచి చెలఁలచెలి మధ్రువమా
నరులకని యోగితత్త్వం, బరయును వెల్లూరి వేంకటాచలరమణా. 33

కృచ్ఛ్రేణామేధ్యమధ్యే—

జననిక్షిస్థనిర్బ్రా, ధన మబలాసంగచింతనము వార్ధక్యా
బును సీ దీనసుఖములే, దనువుగ వెల్లూరి వేంకటాచలరమణా. 3౪

వ్యాఘ్రీవతిష్ఠతిజరా—

పులివలె జర తెవు లరిగతిఁ,గలఁవ జనులబ్రదుకు భిన్నఘటజలమువలెం
దొలఁగ నహితముడుగని దను,దలరఁగ వెల్లూరి వేంకటాచలరమణా. †

బ్రహ్మేన్ద్రాది మరుద్గణాః—

కమలజుపదవి తృణప్రా,యము త్రిభువనరాజ్యలక్ష్ము లతితుచ్ఛము లం
చు ముని విభవములఁ గోరం, డమరఁగ వెల్లూరి వేంకటాచలరమణా. 3౬

సా రమ్యానగరీ మహాన్—

పురములు రాజులు తరుణులు, పరివారము భోగ మెవరివశము ననుండుఁ
ధరనాశాలమె దైవం, బరయఁగ వెల్లూరి వేంకటాచలరమణా. 3౭

---

* ఆధివ్యాధిశతై... † ...వ్యాఘ్రీవ... పద్యము అనువాదము లేదు.

యత్రానేకః క్వచిదపిగృహే—
ఒకటి పది పదోకటిగ, గా,లకితవుం డిలః పలక బ్రాణులన్నారెలపా
సికలు శేబగలుగా నా,టకలరు వెల్లూరి వేంకటాచలరమణా. ౩౮
ఆదిత్యస్య గతాగతైః—
అనుదిన మినుని గతాగత, మున నాయువు నిత్యకృత్యములం గాలము వో
మనుజుండు మోహాసుర భ్రమిం, చనయము వెల్లూరి వేంకటాచలరమణా.
రాత్రిః సైవపునస్సఏవ—
ఇనుండుదయించెనుగ్రుంకెను, దినమురజనియనుచుం బనులందివురుకురయ్యో
జనులింధేమిఫలములే, దనువుగ వెల్లూరి వేంకటాచలరమణా. ౪౦
నధ్యాతం పద మీశ్వరస్య—
మనసిజవైరిధ్యానము, ఘనధర్మము స్త్రీసుఖంబు గనలేనిజనుల్
జననీయౌవనఘాతుకు, లనవలె వెల్లూరి వేంకటాచలరమణా. ౪౧
వాభ్యస్తా ప్రతివాదిబృన్దదమనీ—
చెలి నెనయక నరుండసి విద్యలం బరుల జయింపకనె వృథాప్రాయమువో
నల పాడిలు దీపము వలె, నలరును వెల్లూరి వేంకటాచలరమణా. ౪౨
పక్షద్వయనిరూపణము—
వనితాసుఖమొందరు విద్యను గ్రత్తినిం బరుల గెల్చి యశమందనియా
జనులు పాడింటి దీపము, లనువుగ వెల్లూరి వేంకటాచలరమణా. ౪౩
విద్యానాధిగతా కళఙ్కరహితా—
తలిదండ్రుల మనుపక విద్యల దొరచే ధనముగొనక యతివ నెనయకం
బలుకూళ్లకాకివలె నరుం, డలరును వెల్లూరి వేంకటాచలరమణా. ౪౪
వయం యేభ్యో జాతాః—
తనపెద్దలు సములు హితులుం, జనం గ్రమము వెంటనంట సైకతవనిరీ
తిని నుండం బ్రమద మెట్లగు, ననువుగ వెల్లూరి వేంకటాచలరమణా. ౪౫
ఆయుర్వర్షశతం—
సమశత మాయువు నిద్రను, గము గొద వది బాల్యవార్ధకములభయదరో
గములం జను జనులకునుసుఖ, మెటులనె వెల్లూరి వేంకటాచలరమణా.
క్షణం బాలో భూత్వా—
బాలుండగు దరుణుండగు నర, పాలుండగు దరిద్రుండగు నటుండగునటుండౌ
లీల నరుండు నటుంగతి శర, దాలక వెల్లూరి వేంకటాచలరమణా. ౪౭

త్వం రాజా వయమ ప్యుపాసితగురుః—

కలదు సిరి దొరకు నే వి,ద్యలఁగలగురుభటుఁడ నతఁ డనాదృతి సేయ
న్నిలనే మగుదను నిస్పృహుఁ, డలరఁగ వెల్లూరి వేంకటాచలరమణా*

ఫలమల మశనాయ స్వాదుపానాయ తోయం—

ఫలములు దినఁ ద్రావఁగ జల,ములు వలువలు గట్టఁ దల్పముగ నిలయుండం
గలుద్రావుధనికులకు బుధుఁ, డళుకునె వెల్లూరి వేంకటాచలరమణా. ౪౯

అశీమహేవయం భిక్షాం—

ధరఁబవ్వళించి హరి దు,బరులై భిక్షాన్నమెత్తి భక్షించెదు భూ
సురులు ఖలనృపులమెత్తురె, హరనుత వెల్లూరి వేంకటాచలరమణా. ౫౦

ననటా నవిటా నగాయకాః—

కులుకుఁగుచంబులు గలచె,ల్వల నట విట గాయకులను బలురజ్జులమ
ర్త్యులఁగాక కనఁడు బుధమం,డలి దొర వెల్లూరి వేంకటాచలరమణా.

విపులహృదయై రీశైః—

తగఁ గొన్ని పల్లెలకు దొర,లగు నల్పులకేలగర్వ మధిపు లనేకుల్
జగ మేలి గెలిచి విడువరె, యగధర వెల్లూరి వేంకటాచలరమణా. ౫౧

అభుక్తాయాం యస్యాం—

ధరనెంతయు నేలిన భూ,వరతతి కేలాభ మబ్బె వాఁశతాంశ
స్థిరనేలి గర్వపడిమెద, రరసులు వెల్లూరి వేంకటాచలరమణా. † ౫౩

సజాతీకోప్యాసీత్—

హరుఁ డాత్మకపాలము తల, ధరియింప మను నఁటువ దొర తన బ్రోవను న
ల్గురు మ్రొక్క మదింప నితరుఁ, డరుసా వెల్లూరి వేంకటాచలరమణా. ౫౪

పరేషాం చేతాంసి ప్రతిదివసం—

పరహిత మొనర్చి నరుమది, స్థిరమై యుండ దది గలుగఁ జింతామణిచే
కలుగతి నిష్టము లీయదె, యరయఁగ వెల్లూరి వేంకటాచలరమణా. ౫౫

పరిభ్రమసి కిం ముధా—

మనసు వెతఁ జెంద నేల య, యిన దాఁ గాని దిల గాదు ధృతివిబుధుఁడువ
చ్చినఁ గొను లేకూరకెయుం, డనువుగ వెల్లూరి వేంకటాచలరమణా. ౫౬

---

* అర్థానామీశిషేత్వం- వయమిహాపరితుష్టావేఽ౧ై-అను శ్లోకములకుఁ బద్యములులేవు.

† వృత్తిఁడో [illegible] అను శ్లోకమునకుఁ బద్యములేదు.

ప్రస్తాద్వార మేన్ద్రి శూర్ధగహనాత్—

భవరతి విషయస్పృహ లేక విషమసుఃఖావహము సుఖము సుశ్రేయం

బవుస్వానుభవముఁ బొందఁగ, నవు శ్రీ వెల్లూరి వేంకటాచలరమణా. ౫౭౭

స్నాహం మార్జయ—

హరుఁగొలువక మమతను మది, సిరిగోరునకులునరుగులు చిలువలుజ్వాలల్

వెఱపులు తరగలు తిరములె, యరయఁగ వెల్లూరి వేంకటాచలరమణా.

షట్ద్వయనిరూపణము—

మనసు శశిధరుని గొలువక, ధనమేలాశో కోరు బుద్బుదము లూర్పులు మె

ర్పునదులు చిలువలు తిరములె, యనువుగ వెల్లూరి వేంకటాచలరమణా.

చేతశ్చిన్తయ మారమాం—

నరవభ్రూకుటి వేశ్యగు, సిరిఁ గోరక బొంతగప్పి చేతనె కాశీ

పురి భిక్షాన్నము దిన మే, లరయఁగ వెల్లూరి వేంకటాచలరమణా. ౬౦

అగ్రేగీతం సరసకవయః—

వెనుక నెదుటఁ బార్శ్వములఁ, గన వీచోవులును గాణకవులుండ సుఖం

బనవలె లేదె తపముసే, యనవలె వెల్లూరి వేంకటాచలరమణా. ౬౧

ప్రాప్తాః శ్రియః సకలకామదుఘా స్తతః కిం—

కలిమి గలిగి మిత్రుల ధని, కులఁ జేసి విరోధిసిరులు గొన నేమగు మ

ర్త్యులతనువు లనిత్యము లై, యలరుచు వెల్లూరి వేంకటాచలరమణా. ౬౨

భక్తిర్భవే మరణజన్మభయం—

జనుఁడు మమకార ముడిగియు, ధనవికృతులు విడిచి శివుని దలఁచివనముఁ జే

రిన నింద్రపదవి నేమిటి, కనువుగ వెల్లూరి వేంకటాచలరమణా. ౬౩

రస్తానన్త మజరం పరమమ్—

హరిహరముఖపదవులు పే, దటికము ఁజరము వికాసిత మనంతంబై

పరఁగెడు బ్రహ్మము సుకర, మ్మరయఁగ వెల్లూరి వేంకటాచలరమణా. ౬౪

పాతాళ మావిశసి—

హరిదంతరము లతల మం, బర మిలఁ జవలమునఁ దిరుగు మనుజులమనసే

మటి నైన న్నిను దలఁపదు, హరసఖ వెల్లూరి వేంకటాచలరమణా. ౬౫

వేదైః స్మృతిభిః పురాణపఠనైః—

మనుజులు కోమటిబేరం, బున వేదపురాణశాస్త్రము లనుచు యాగా

లని బ్రమతుడు నిను, నిర్లక్షము వెల్లూరి వేంకటాచలరమణా.

యతో మేరు శ్రీమాన్ —
శరధు లిగుర మేరువు పడ, ధరసనఁ గరికర్ణచపలతనువులు తిరమా
నరు లేల మోహ ముడుగరో, హరనుత వెల్లూరి వేంకటాచలరమణా. ౧౭

గాత్రం సఙ్కుచితం —
వినక పలుకడలి లాలై, కనరా కంగంబు వంగి గతిచెడి వృద్ధై
జను సఖసుతసతులొల్లరు, ననుపుగ వెల్లూరి వేంకటాచలరమణా. ౧౮

వర్ణంసితం శిరసివీక్ష్య —
తలనరసిన వృద్ధుల నెమ్, కలుగలచండాలబావిగతిఁ జెల్వలు ద
వ్వులఁ గాంచి పాసి పాయుదు, రలరఁగ వెల్లూరి వేంకటాచలరమణా. ౧౯

యావత్స్వస్థమిదంశరీరం —
ఇల జర రుజ లేకింద్రియ, బలము గలిగి నపుడె తత్త్వభావజ్ఞుఁడుగా
కిలు గాల బావి త్రవ్వెన, నలరునె వెల్లూరి వేంకటాచలరమణా. ౨౦

తపస్యన్తస్సన్తః —
పలుచదువులు చదువఁదపము, సలుపవదాన్యులను గొలువ జనులకుఁబ్రొద్దే
దిల నాయు వల్పతరమై, యలరును వెల్లూరి వేంకటాచలరమణా. ౨౧

దురారాధ్యాశ్చామీ —
దొరలు చపల చిత్తులును, మ్కరుఁడు యముఁడు జరనివారకము సుఖములు దు
ర్భరములు జ్ఞానమె మేలౌ, నర యొఁగ వెల్లూరి వేంకటాచలరమణా. ౨౨

మానే మ్లాయిని ఖణ్డితేచ —
సిరిలేక యర్థిఁగడపుచుఁ. బ్రజనరహితుఁడయి (నష్టు) ప్రాలేయమహీ
ధరమాశ్రయింపఁగాఁ దగు, నరయఁగ వెల్లూరి వేంకటాచలరమణా. ౨౩

రమ్యాశ్చన్ద్రమరీచయః —
చెలిమోము వనము కావ్యము, నెలతళ్ళులు హితుల గాక నిర్వాణమెదం
దలఁచినదనుకను రమ్యము, లలరఁగ వెల్లూరి వేంకటాచలరమణా ౨౪

రమ్యంహర్మ్యతలం —
విగగుదనిలచఁదీపము, పగిది యనుచు గాని చెలులపాటల మేసల్
దిగవిడిచి వనులనిలుతురె, యగధర వెల్లూరి వేంకటాచలరమణా. ౨౫

ఆసంసారాత్త్రిభువనమిదం —
వినఁగనలేదేనాఁడై, నను విషయవశా*వివశమనః కరిసలువం
† గను నాలానం బెవ్వం, డనియును వెల్లూరి వేంకటాచలరమణా. ౨౬

* గృహీత-మనఃకరి మా † ఘనముగ నాలానంభవ । దనవలె-మూ

యదేతత్స్వచ్ఛందం—

కలుగు సుగోష్ఠిం బుణ్యాము, ఫలమెన్న వశంబుగాదు స్వైరగుఁడా ని

శ్చలవిద్య శమము జ్ఞానికి, నలవడ వెల్లూరి వేంకటాచలరమణా. ౭౭

క్షణ్ణాఏవమనోరథాశ్చ—

తలఁపులు వయస్సు సుగుణ, మ్ములు వ్యర్థముపోవఁగాయముఁడు రాఁగా మ

ర్త్యులకు శివుండే దిక్కగు, నలరఁగ వెల్లూరి వేంకటాచలరమణా. ౭౮

మహేశ్వరేవాజగతామధీశ్వరే—

జగదంతరాత్మకుఁడు హరి, జగదీశుఁడు శివుఁ డిరువురు సములైన శివుం

దగ భక్తిగొలుతు నను నొకఁ, డగధర వెల్లూరి వేంకటాచలరమణా. ౭౯

స్ఫురత్స్ఫారజ్యోత్స్న—

కనదిందురుచిధవళసుర, ధునీపులినములందు బాష్పతోయాంబకుఁడై

ఘనుఁడు నిసి బలుకు శివహర, యనుచును వెల్లూరి వేంకటాచలరమణా. ౮౦

వితీర్ణేసర్వస్వే—

ధీరులు సాత్త్వికులై సం, సారముడిగి సంపదల విసర్జించి పురీ

శారదనిశ నెన్నదు రహి, హరుఁగ వెల్లూరి వేంకటాచలరమణా. ౮౧

కదావారాణస్యాం—

ధరఁగాపీనధరుండై, కరములు ముకుళించి కాశి గంగాస్థలి శం

కర పార్వతీశ యనుబుధుఁ, డరయఁగ వెల్లూరి వేంకటాచలరమణా. ౮౨

సత్పద్వయనిరూపణము—

ఇలఁ గాశిని గంగాతట, ములఁ గోఁచి ధరించి కేలుమోడ్చి గిరీశా

యలికాక్ష యని దినము గడ, పలరఁగ వెల్లూరి వేంకటాచలరమణా. ౮౩

స్నాత్వాగాఙ్గైఃపయోభిః—

ఇల గంగోదకముల సుమ, ఫలముల శివపూజ చేసి భక్తినగములకా

నిలిచి భవ మెడలు నెపుడను, నలరఁగ వెల్లూరి వేంకటాచలరమణా. ౮४

ఏకాకీ నిస్పృహశ్శాన్తః—

కరపాత్రుఁడు నిస్పృహుఁడై, హరుఁ దలఁచుచు శాంతుఁడై దిగంబరుఁడై క

ర్మరహితుఁడవు డౌననిబుధుఁ,డరయును వెల్లూరి వేంకటాచలరమణా ౮౫

పాణింపాత్రయతా—

భిక్షాన్నము కరపాత్రల, భక్షించి జగము తృణముగ భావించియు ఫా

లాక్షుదయఁ జిత్సుఖమునను, [illegible] వెల్లూరి వేంకటాచలరమణా. ౮౬

కౌపీనం శతఖణ్డజర్జరతరం—

ఖలకంథాకౌపీనుం, డిలభిక్షాశి వనిశయుఁ డభీష్టగుఁ డౌని
శ్చలమతికి రాజ్యమేమిటి, కలరఁగ వెల్లూరి వేంకటాచలరమణా. ౮౭

బ్రహ్మాణ్డమణ్డలీమాత్రం—

ఘనుఁడు బ్రహ్మాండమాత్ర, మ్మున కేలాసపడు మత్స్యములు గంతులిడన్
వనరాసులు చలియించునె, యనువుగ వెల్లూరి వేంకటాచలరమణా *౮౮

మహీశయ్యాపృథ్వీ—

నెల దివ్వె వితానము దివి, యిల తల్పము కేలు దిండు నీద సురటిగాఁ
జెలిముక్తిగ దొరవలె యతి, యలరును వెల్లూరి వేంకటాచలరమణా. ౮౯

వసుధావ్యయనిరూపణము—

ఇల శయ్య దివ్వెశశి కరు, వలి చామర దిండు చెయిగఁ బార్థివువలె ము
క్తిలలనఁ గూడి యతికర, మ్మలరును వెల్లూరి వేంకటాచలరమణా.† ౯౦

చణ్డాలఃకిమయం—

యతియో (మాలఁడో) శూద్రుఁడో
మతిమంతుఁడో ద్విజుఁడో యనుచు మనుజులు పలుకన్
మతిభేదము నొందఁడు యతి
యతిపతి వెల్లూరి వేంకటాచలరమణా. ౯౧

హింసాహీనమయత్నలభ్యమశనం—

జగతినహింసాసాధ్యము, లగుతృణవా(తాది)మెసఁగి యవనిఁ బరుండున్
మృగఫణులవలెను యతి యల, రగధర వెల్లూరి వేంకటాచలరమణా. ౯౨

గఙ్గాతీరేహిమగిరి—

తలఁపు శివుఁ జేర్చి(హిమగిరి), శిలయోగి సమాధినిద్రఁ జెందినమైపు
ల్గులురాచుకొనఁగ సుదినము, లలరఁగ వెల్లూరి వేంకటాచలరమణా. ౯౩

పాణిఃపాత్రం పవిత్రం—

కరపాత్రభిక్షుమన్నము, ధరతల్పము దిక్పటంబు దైన్యమసంగం
బిరవౌన యతికివి ధర్మము, లరయఁగ వెల్లూరి వేంకటాచలరమణా ‡ ౯౪

క. ధరభర్తృహరికృతంబై, పరఁగిన శ్లోకములు కందపద్యంబులుగా
§నరసింగకవిరచించెను, నరుడుగ వెల్లూరి వేంకటాచలరమణా.

---

* మాతర్లక్ష్మి భజస్వ— అను శ్లోకమునకుఁ బద్యము లేదు. † భిక్షాశీజనమధ్యసఙ్గరహితం— అను శ్లోకమునకుఁ బద్యము లేదు. ‡ మాతర్మేదినితాతమారుత— అనుశ్లోకమునకుఁ బద్యము లేదు.
§ వెల్లాల కవినరసింగయ్య— జటప్రోలు— కొల్లాపురము అని యముద్రితగ్రంథ చింతామణియందు ఖండములోఁ గలదు,

శ్రీరస్తు.

# భద్రగిరిశతకము.

## భల్లా పేరకవికృతము.

---

### సీసపద్యములు.

శ్రీజానకీమనోరాజీవషట్పద పదపంకజాశ్రితపద్మగర్భ
గర్భనిర్భేదసంగరబాణతూణీర నీరజబాణసన్నిభశుభాంగ
యంగజవైరిశరాసనభేదన దనుజవిద్వేష సుందరముఖాబ్జ
యబ్జబాంధవకులాధ్యక్ష నీరదవర్ణ వర్ణితామరమానివరకలాప
పవననందనసన్ముఖభక్తపాల, పాలకడలిని విహరించుపద్మనాభ
భద్రగిరివాస శ్రీరామభద్ర దాస, పోషబిరుదాంక రఘుకులాంబుధిశశాంక.

పద్మభవస్తోత్ర పావనచారిత్ర పంకజదళనేత్ర బహుపరాకు
దైతేయశిక్షణ ధర్మవిచక్షణ భక్తసంరక్షణ బహుపరాకు
వారిధిబంధన వరభక్తచందన భరతాదివందన బహుపరాకు
తాటకభంజన తాపసరంజన పరమనిరంజన బహుపరాకు
భద్రగిరినుండి వచ్చునీపారుషంబు, విశ్వవిఖ్యాతిసేయక విడువనింక
భద్రగిరివాస శ్రీరామభద్ర దాస, పోషబిరుదాంక రఘుకులాంబుధిశశాంక.

పదియు రెండేండ్లప్రాయంపువాడవై మించి తాటకనెట్లు త్రుంచినావొ
రణశూరులగుదైత్యగణములఁ బరిమార్చి కౌశికుసవ మెట్లు కాచినావొ
శరములఁబట్టి యెత్తగరాని హరువిల్లు చెలకు కైవడి నెట్లు విఱిచినావొ
సంగరరంగవిశారదుఁడైన భార్గవరాము నేరీతిఁ గడపినావొ
కాని తెలియదు యప్పటిక్రమముఁ దలఁపఁ
దురకదొర లన్నభీతిలి యొఱుకుదొరవు
భద్రగిరివాస శ్రీరామభద్ర దాస 3
పోషబిరుదాంక రఘుకులాంబుధిశశాంక.

కాకంబుగాదు వేగమె బాణమెక్కించి కావుకా వనిపించి కాచి విడువ
సదధిగా దవసిపై నఫ్సాంగఁగాఁ జూచి బాణాగ్రమున నిల్పి భక్తిఁబ్రోవఁ
జిత్రమృగముగాదు సీత మెప్పులకునై వేటాడి వనవీథి నంటితఱుమఁ
బుడమి నెన్నంగ బంధుఁడుగాఁడు భుజబలశాల్ నఱికిపాఱఁగనైవ సరకుగొనక
నవని దురకల నెదురరా దనితలంచి, వలస[illegible]వవ్వ, భద్రగి

ఖరదూషణాదుల ఖండించితి మటన్న యామిక మదిలోన నడఁచివైచి
మాయామృగంబును మర్దించితి మటన్న గర్వంబు మనసులోఁ గట్టిపెట్టి
వాలి నొక్కమ్మునఁ గూలనేసితి మన్న సాహసోక్తులు మదిఁ జక్కవిడిచి
రావణకుంభకర్ణనిశాచరులఁ బరిమార్చితి మను ప్రజ్ఞ మదిని విడిచి
యోడపై నెక్కి తురకలజాడఁ గాంచి
యణుకఁదగునయ్య మీవంటి దొరలకెంకు, భద్ర. ౫
సున్నతీలాగిఁ జేయఁ జూతురో యని వేగ మేలుకొంటిరి యింత మేలుగలదె
గడుగుడీపాగలు పైకొనఁ జూతురోయని వలసపోతిరి సరివారు నగరె
మును పలావును దిను మనియందురోయని పాఱిపోయితిరింత పాటిగలదె
లుడిపీ యఖీచూదు లిడఁజూతురోయని యోడమెక్కితిరి మీరొగిధరిత్రిఁ
గులము గలిగిన నెందైన స్థలముగలద
టనుచు భక్తులదిగనాడి చనఁగఁ దగునె, భద్ర. ౬
చెప్పినట్టులు విన్నఁజేయు నోపిక కొండచఱియలయందుండు చరియ దుంప
దూడులు దినుశక్తి వాడికోఱలు గల తులువమృగాలలోఁ మెలఁగుయుక్తి
జడలు దాలుచు నేర్పు జడదారులనుగూడియిడుమఁ బడుతాల్మిపడుకులందుఁ
బండుకష్టతరంబు పర్ణశాలలయందుఁ గాపురములు సేయుక్రమము తొల్లి
తల్లి కోరికి చెల్లింప ధరణిలోన
నేర్చితి మటన్నఁ బలుమాలు నెఱపఁదగునె, భద్ర. ౭
రఘువంశమున కెంతరట్టడి దెచ్చితి వరుసఁ బోలవరంబు వలసపోయి
సోకుమూఁకల కెంతచులకన మైతివి వరుసఁ బోలవరంబు వలసపోయి
భక్తవితతి కెంతభయము పుట్టించితి వరుసఁ బోలవరంబు వలసపోయి
* * * * *
దశరథునిగర్భమునఁ బుట్టి దశశిరస్సుఁ
దునిమినటువంటి దొరకిది దొడ్డతనమె, భద్ర. ౮
కైకవరము జ్ఞాపకము వచ్చెనో మళ్ళ వనములఁ జరియింప వసుధలోన
నీలాద్రిపతిఁ జూచి నేరిచికొంటివో వలసలువోవ నీవసుధలోనఁ
బట్టిసపతికిఁ జెప్పఁదలంచి పోతివో వలసపేరెడుకొని వసుధలోన
రామలదేవు కారణజన్ముఁడని తోఁచి వరమీయఁబోతివో వసుధలోన
లేక యిది యేమివింత ముల్లోకములను
జడిసి వెంచేసితి వటన్న జడుపుగాదె, భద్ర. ౯

సౌమిత్రి కైనఁ దోఁచకపోయెనా యిల్లు పోవరాదని నీకు బుద్ధిదెలుప
సీత మైనను మీకుఁ జెప్పలేదాయెనా యిల్లువెళ్ళుట మహాహీనమనుచు
హనుమంతుఁ డిపుడు మీయాజ్ఞకు వెఱచెనా యవురుగాదని మిమ్ము నడ్డగింప
శిష్టరాజగు మీవసిష్ఠుఁ లేఁడాయెనా యిది బుద్ధిగాదని యెఱుఁగఁ జెప్పఁ
భద్రగిరినుండి శ్రీవీరభద్రగిరికి, వలసపోవుటయిది యేమి వాంఛయయ్య, భద్ర.

హనుమంతు నెచ్చోటి కనిపితిరో మీకు జడుపుట్టినయట్టిసమయమునను
సుగ్రీవుఁ డేగునాఁ జొచ్చియుండెనో మీకుజడుపుట్టినయట్టిసమయమునను
అంగదుఁ డేవంకకల్గిపోయెనో మీకు జడుపుట్టినయట్టిసమయమునను
జాంబవదాదు లెచ్చటనుండిరో మీకు జడుపుట్టినయట్టి సమయమునను
గపులు మీయొద్ద నుండిన రిపులకేల
యోడి వేంచేతురో మీర లోడమెక్కి, భద్ర. ౧౨

పట్టాభిషేక సంభవవియోగము జటావల్కలములు వనవాసములను
యతిపూజ గొనుటలు యతిగతిఁ దిరుగుట లాలిఁ గోల్పోవుట లడవులందు
సంచరించుటలు నిశాచరబాధలు చెందమున్దియువిందు లెంచ మొండె
మునుగూల్చుట యిదానవిని ముక్కుగోయుటక్రోతినేయుటబ్రహ్మకులజుఁజంపు
టిల్లు వెళ్లుట లాదిగా నినకులమున
నెనయ మీనాఁడె ధరఁ గల్గెననరె జనులు, భద్ర. ౧౩

భరతశత్రుఘ్నులు వరశంఖచక్రముల్ సౌమిత్రి శేషుఁడు జనకతనయ
యిందిర కపులెల్ల బృందారకులటంచు స్మృతులెల్లఁ గొనియాడ నతివినోద
లీలలు గల్పించి బేలనై కేవలమానుమచర్యలు పూనెదకట
వలసలు మీకేల వనవాసము లవేల వైకుంఠవాసిని వరుసతోడ
మీబలపరాక్రమము లెల్ల మీ రెఱుఁగక
తొలఁగి పోవచ్చునే తురకలకు జడిసి, భద్ర. ౧౩

మునలిమామలతోడ ముచ్చటాడఁగలేక తురకల కెదురుగా నరుగలేక
మ్లేచ్ఛుల మన్నించి మెప్పు లీయఁగలేక పారసీకులబాధ పడఁగలేక
యచ్ఛిద్రకర్ణుల యాజ్ఞ నుండఁగలేక యపసవ్యలిపులతె న్నరయలేక
చేఁఖానులకుఁ దాజీము లీయఁగలేక మును నమాజుధ్వనుల్ వినఁగలేక
పాఱిపోవుట యిది యేమి ప్రజ్ఞ గొడుగు
నెత్తిఁగి యేమెండ కాయుఁడ నిడఁగవలయు, భద్ర. ౧౪

తెలివితెచ్చుకయుండఁ దెన్నువీక్షింపక వాహనంబులమీఁద వాంఛ లిడక
ద్వారపాలకులకు దారి చెప్పక భక్తగణముల కెల్లను గనులఁబడక
సొమ్ములచందుగల్ చూడ నొల్లక కపి బలముల నెల్లను బిలువనీక
సౌమిత్రి కరిగెడి జాడ చెప్పక వేగ సీత నెత్తుక యతిశీఘ్రమునను
గలముపై నెక్కి మీవంటిఘనులు తొలఁగి
పోవఁ జేసెనె వలస లీపోలవరము, భద్ర. ౧౫

సొమ్ములు బీబీలసొగసు కప్పన చేసి వాహనంబుల నశ్వవాహనులకుఁ
బంచపాత్రలు సురపానవర్తనులకుఁ బళ్ళెరంబులు మాంసభక్షకులకు
శఠకోపములు విప్రశఠులకు బంగారుతబుకులు బలుదునేదారులకును
గిన్నెలు వరుస నెంగిలిముచ్చులకుఁ బట్టుపీతాంబరంబులు పింగళాక్షు
లకు నొసంగియు భక్తుల వికలపఱుపఁ
బాఱిపోతిరి మీరున్నయూరు విడిచి, భద్ర. ౧౬

సంచరించిరిగదా సమదావనవ్యులు విమలబృందావన వేదికలను
పీటఁబుచ్చిరిగదా విరులచేఁ జెన్నొందు ఘనమల్లికాపుష్పవనచయంబు
గలుచేసిరిగదా కళ్యాణమండపాగారవాహనగృహాంగణము లెల్లఁ
గొల్లలాడిరిగదా కోమలనవవీధికల నొప్పు దివ్యగంగాఝరములఁ
జూఱపట్టిరి పురమెల్లఁ జొచ్చి విప్ర
మందిరము లన్ని తురకలు మత్తులగుచు, భద్ర. ౧౭

సంస్కృతాంధ్రోక్తులసారంబు లుడివోయె నవసవ్యభామల నమరె జగము
పౌండరీకాదులఁ బశుబంధనము దప్పి కటికి మేఁకల జపాల్గలిగెనూళ్ళు
కర్పూరచందనాగరుధూపములు వాసి గంజాయిపొగలచేఁ గప్పెఁగుళ్ళు
వేదశాస్త్రంబు లెలయు బాంకులపట్లమొల్లాఖురానులు మ్రోగెనహహ
యేమిచెప్పుదు మీమాయ లెవ్వరెఱుఁగఁ
గలరు బ్రహ్మాదులకు నైన నలవి గాదు, భద్ర. ౧౮

ధర్మపేటనివాసు ధైర్యంబు విడనాడె వేటగోపాలుఁడు మాటలుడిగెఁ
బాలవంచపురీశు బలహీనత వహించెఁ గృష్ణసాగరపయ్యక్రిందుఁ జూచె
రామానుజవరపురాము లూరక యుండెఁ బిరివెడిసామి యుబ్బరముగదిరెఁ
బర్ణశాలేశుఁడు బహుభంగులఁ దపించె శ్రీరామగిరివాసుఁ జింతనొందె
భద్రకడనుండి శ్రీవీరభద్రుకడకు
వలసవెంచే యుద్ధులఁ దినవార విన్నము, భద్ర. ౧౯

తురకలతో మైత్రి నెఱపలేవైతివి లోకత్రయము నెట్లు సాఁకఁగలవు
గర్నేలుగుండ్ల డాకాకోర్వలేవైతి వసుసుబలంబు నెట్లోకఁగలవు
నీస్థలంబున నీవు నిలువలేవైతివి భక్తుల నెట్లు కాపాడఁగలవు
మానవాధీశ్వరు మరువు సొచ్చినవాఁడ వమరారులకు నెట్టులభయ మొసఁగె
దకట నిను మనమున నమ్మి యట్టిజనులఁ
దొలగి వేంచేసితివి తురకలకుజడిసి, భద్ర. ౨౦

శ్రీరామచంద్ర దీక్షితిని నీరస మదె "ఆశ్చర్యబఖై"రను నచ్చులమరె
గోవిందశబ్దములల్ గుడి మాలి "బాహాసీ యాహాసీ"ననుపల్కులావహిల్లె
గరుడాశ్వగజరథవర వాహనములచే బరఁగువీథులు పీర్ల ప్రభలఁ జెందె
సత్రశాలాంగణల్ చలువ పందిరులు బబ్బరచి ఖాసాలచప్పరములయ్యె(?)
మత్స్యమాంసాదికముల నమరెను గోద
రేవు లెచ్చటఁగన్న గోలీలనమరె, భద్ర. ౨౧

హనుమంతు ముట్టి సర్వాంగ మొంగిలి చేత ; మిరి పట్టెల మాయఁజమిరెనొకఁడు
గరుడాళువారి ఱెక్కలు ముక్కు జెక్కులు నొక్కి మండపముపై నెక్కెనొకఁడు
ఎంబెరుమన్నారు నింటిలోన నమాజు చదివి తా దసిబిసి సలిపెనొకఁడు
వరుసఁ బన్నిద్రాళువారి నొక్కుమ్మడి డీకొక్కులాడించి డీకె నొకఁడు
మిగిలి పరికించి శాంత మేమిటికిఁ దలఁప
వసుస మీరలు తిరుపల్లెపట్టు నెడల, భద్ర. ౨౨

అతిరసంబులు గావు నారగించి వయారి కోరమీసంబులకొనలుదులుపఁ
దిరుపేనములు గావు తీరుగా భుజియించి పొరలి యాడుచుఁ జిన్ని బొజ్జనిముర
దధ్యోదనముగాదు తగినంత భక్షించి గట్టునఁ ద్రేన్చి బాగాలనమల
వడలుగావు నయోధ్యవాసులతోఁ గూడి ముచ్చటదెలుపుచు మోనసి మెసవఁ
జేయు పణ్యారములు గావు చిత్తగింపఁ
గినియు జాల్దుంగు...జంగీబలములు, భద్ర. ౨౩

పొట్లాది బియ్యంబు పులిహోరలు మెక్కువారికి రసముపై వాంఛగలదె
శర్కర యంగళ్ళఁ జపగొన్నవారికి బ్రాహ్మణంబుపైఁ సిచ్ఛపర్వమున్నె
వైష్ణవసద్గోష్ఠి వర్తించువారలు తురకఁ ష్కరులపై నలుకఁ గలరె
ఉభయ వేదాంతసద్మాహానుండౌను వారు మంత్రాంగశక్తుల మలుపఁ గలరె
దేవమానవశక్తుల తెరువు వదలి
తురకదొంగలన్న భీతిలిమీలుకదొరవు, భద్ర. ౨౪

సొగసుగా శంఖచక్రగదల్ ధరించుట తడఁబాటు చతురహస్తమున వెలయు
ఘనతగా శరశరాసనములు దాల్చుట పురజనంబులకు నద్భుతముగాఁగ
హావుసుగా సూర్యపుత్రాదులౌఁ కోఁతిసేనల నేలుటలు సూర్యకులములోనఁ
బ్రజ్ఞగా పతితపావనబిరుదాంకంబు చూపుట లెల్ల బలోచ్ఛేద్యముగను
యవనబలములు నల్గడ ల్గవిసి మిమ్ము
దోఁచుకొను వేళ శౌర్యంబు దాఁచితకట, భద్ర. ౨౫

శంఖంబు కడుబీదజంగంబుకడ నున్నఁ *బూరించి తన పొట్టపోసికొనును
చక్రంబు కమ్మరిసరసనుండిన వేడ్కఁ గూడలైనను జేసికొను రయమున
గద సుకాలీవానికడనున్న వేవేగ గోనెలైనను నెత్తుకొను ముదమునఁ
దగనాల్గుచేతు లుద్ధంసాకఁ గల్గిన నీక నింతరాజ్యంబు నేలుకొనును
స్వామి మీ కేలయివి వృథా సరసముగను
వారివారికి దయసేయు వరుసతోడ, భద్ర. ౨౬

సరసప్రబంధానుసంధానములు గావు మొల్లాఖురానులమ్రోఁత గాని
మహి మహీసురుల నమస్కారములు గావు మ్సల్లలుసేయు సమాజు గాని
తగ నర్చకులు సేయు తళిహాలుగావు లావుపాలావుడేకిసా ల్పొల్పుగాని
చందనాగరుధూపసమితిగాదు గుడాకుగంజాయిపొగలసంఘంబుగాని
బలసి తిరునాళ్ళకేతెంచు ప్రజలుగారు
ఘనతరంబైన తురకలష్కరులు దెలియు, భద్ర. ౨౭

కన్నీరు నించిన పసిఁడికొప్పెరలె మీకు సారాలు నిండు సీసాలబారు
దాసులు తెచ్చు తీర్థపుబిందెలే మీకుఁ బారసీకుల మద్యభాండవితతి
భువి భక్తులొనరించు భోగంబులే మీకుఁ దురకలు సేయు కందూరిచయము
కళ్యాణవేదికాగ్రమునుండు హోమకుండంబులే పీర్లగుండములు మీకుఁ
గాకయుండిన నిట్లేల కాఁకపుట్ట
దవనిఁ దురకలుంచి దుశ్చొండాడునపుడు, భద్ర. ౨౮

గజరథఘోరాకారఘుటాటోపంబులు దగవిన్నఁ జెవులు చిందరలుగోనెనో
కంచుఫిరంగుల ఘనస్వానము విన్నఁ బెట్టుగ గూడియల్ జల్లుమనెనో
యువనాశ్వఖురపుటజవమునఁ దిశలెల్లఁ గదిసిన పెందూళి గప్పుకొనెనో
అరబుసిద్దీల పెష్మాడు నొప్పఁ జొచ్చి తోలుదాల్తఁ బదములు తొట్రుపడెనో

* [illegible]

కలముపైనెక్కి తిరి మీాసఘనతవిడిచి
క్రమముచే నంగర క్షైనఁ గట్టుకొమ్ము, భద్ర. ౨౮
భరతాదిసహజన్మవరులకు నీపాటి పారసీ చెప్పించు వంతమిడిగి
వ్యాసాదిమునిగణప్రతతి నెలను ఖురానులుఁ చదివింపఁగాఁ దలఁపుసేయు
పరఁగ నింద్రాది దిక్పాలకశ్రేణికి నెరినమాజులుఁ సేయు నేర్పు నేర్పు
వాంఛలేవు నాశ్వారాహులకు వేగ సున్నతీలప్రయత్న మెన్నఁజేయు
చేయకుండినఁ దురకలు చెనుగువాండ్రు
హస్తువిశి వచ్చి రింకమీాఁదఁగ లేరు, భద్ర. ౩౦
సర్వాంగి తురకలు సవరించి వారింతె నీలికూనఁ బైన నెదిధరింపు
మణికిరీటము మ్లేచ్ఛఘనుని కిచ్చితి వింతె శోపిమైనను దాల్పుమేపుమీాఁద
బావాలు యవనులపాలు జేసితి వింతె ముచ్చెలైనం గాళ్ళ కిచ్చగించు
డిల్లీశ్వరునికూఁతు నిల్లాలిఁగా మందయేలితి వింతె మీా కెగ్గు లేల
మతము విడుచుటలెల్ల సమ్మతము మీాకు
కాముకులకును బ్రజ్ఞలు గలవెతలఁప, భద్ర. ౩౧
గరుడధ్వజము లన్న కాఁకుచే నుంటిరో డాలైన తగటుజెండాలు సూచి
తమనిత్యసేవ వాద్యము లనుకొంటిరో యరబుబాజాల నెయ్యంబుఁ జూచి
తిరునాళ్ళ సంగళ్ళతీ రనుకొంటిరో సరిలేని దండుబాజార్లఁ జూచి
వరుసశోడుత భక్తవరు లనుకొంటిరో దరిలేని బలుసుబేదార్లఁ జూచి
కాక భువి నిభరాహిము ఖానుఁ డెంత
మేటి వానవులను గెల్చు మేటికరయ, భద్ర. ౩౨
ఆప్తుబైతో యని యాదరింతురుగదా తురకలతో మైత్రి నెరపవైతి
రాము రామనుచుఁ దాజీము లిత్తురుగదా యూరనుండిన మిమ్ము నూఱసించి
కదదిమిల్నా (?) యని కౌఁగిలింతురుగదా మొనరుగా నేగిన బెదరు లేక
కప్పురవిడెము మల్ ఘనత నిత్తురుగదా నజరువట్టిన మద్దెనజరుగలిగి
కానిపని చేసితివి పోటు కానివలెనె
వరుసఁ దురకలపై నల్గివలసపోయి, భద్ర. ౩౩
అబుసిద్దీను దివ్యాజ్ఞలోవర్తించి చేరి మేకల జపాసేయు లేక
వరుసతో ధరియించు వరభూషణములిచ్చి యుడుకుమూనెలఁ జేయుమంచ లేక
సెట్టికల్లియు వారిఁ జేయునిర్బంధంబు సాదిమీాఁద గవులు వాడ లేక

తమగుమాస్తా యనఁదగునశ్వరాయుని కరుణమీఱంగను గాంచలేక
తొలఁగిపోతిరి మీవంటిదొరలనమ్మి
కొలువఁదగునయ్య దీనులఁ గొలఁదిమీఱి, భద్ర. ౩౪

విల్లునమ్ములఁ గట్టి వెల్గులోఁ జొన్పనా బెదరిపోయెడి దొరబిడ్డలకును
చేతిచక్రము గాల్మిఁ జేర్పనా వెన్నిచ్చి పాఱిపోయెడినరపాలురకును
క్షాత్రధర్మము లెల్ల సరసిలోఁద్రొక్కనా తొలఁగిపోయెడియినకులజులకును
బంటువంతములెల్లఁ బాథోధిఁగల్పనా వరుసఁ దప్పిన రఘువంశజులకు
అనుచు ఖేచరులెల్ల మిమ్మఁ గతొల్లె
చెలఁగి సింహాసనంబున స్థిరుఁడవగుము, భద్ర. ౩౫

శంఖంబుకోసమై చాకిలనిలిపితే నేనీయనని పోవ నీతరంబె
చక్రంబుఁ దెమ్మని స్వార్లను బంపితే యది మల్పుకొను మీయశ్యతరమె
గదఁ దెమ్మనుచు వేగ గరిడీలఁ బంపితే తప్పించుకొను మీతాతతరమె
ఖడ్గంబుకోసమై ఖావందుమళ్ళితే తిరిగి పోరాడ మీదేవ్రుతరమె
వరుసఁ దురకల గతిదెల్సి వలసవోయి
నిల్పితివి క్షాత్ర మీపాటినీకెచెల్లు, భద్ర. ౩౬

ఈపాటిదొర వాట మెఱిఁగి యామంథర కైకకు నుపమలు గఱపె వేడ్క
నీపాటిదొర వాట మెఱిఁగి మీపినతల్లి వెఱవక మిము నిల్లు వెడలఁగొట్టె
నీపాటిదొర వాట మెఱిఁగి వేగ సుమిత్ర కొడుకును సాయంబుగూర్చి పంపె
నీపాటిదొర వాట మెఱిఁగి శూర్పణఖ రావణుతోడ నీస్థితి వరుసఁ జెప్పె
నెఱుఁగ కవనిజ మీవెంట నేఁగుదెంచి
చెఱనుబడియుండదే దైత్యవరునియింట, భద్ర. ౩౭

శంఖంబులోఁ గీర్తిచంద్రిక లిమిడెనో కనుపట్టవాయె సంగరమునందుఁ
జక్రంబులోన భూచక్రంబు దాఁగెనో బలమీయదాయె నిబ్బరముగదుర
గదలోన క్షాత్రంబు నాదిఁగెనో యరులపై రాణింపదాయె గర్వంబుదక్కి
కత్తిలోఁ గోపంబు నొత్తిగ లుండెనో తురకలపైఁ జొరనుఱుకదాయె
సామి యిదియేమివింత మీసాహసంబు
లెందువేంచేసె నరులపై మందగించి, భద్ర. ౩౮

ఈపాటిదొర వాట మెఱుఁగక మిమునమ్మి దేశస్థులెల్లరు దిగులుపడిరి
యీపాటిధొర వాట మెఱుఁగక మిమునమ్మి భక్తులెల్లరునొచ్చ బాధఁబడిరి

యీపాటిదొరవాట మెఱుఁగక మిమునమ్మి సెట్టిపల్లియవారు మట్టమైరి
యీపాటిదొరవాట మెఱుఁగకమిమునమ్మి ముక్కురాయఁడు భూపలాయనంబు
నొందె నీపాటిదొరవాట ముందెఱింగి
కదనమునకుఁ దురుష్కుఁడు గదిసెనహహా, భద్ర. ౩౯

భక్తాన్నశేషంబు పొసఁగ దాసుఁ డమ్మి దినములు గడుపుజగ్గన్నఘనుఁడు
తనుగానకుండ గందము మేన నలఁదించుకొని నిమ్మనల్పు నప్పనవిభుండు
బీదసాదల దోఁచి పృథివి...కన్న(?)వన్నిచ్చు వేంకటపతినృపాలుఁ
డొడయఁడైమణి దెచ్చిమకుటము లోపల బొదిగ్చి దాఁగియుండుసువరదనవరుండు
వారలెల్లను మీపాటి వారు గారె
యొదిఁగియుండిరి యుగచర్య లూహచేసి, భద్ర. ౪౦

శబరివిందయ్యెనే శరభసంబున మీకు భావింప రామదేవుభక్తి
హనుమంతుఁడయ్యెనే యతిసాహసుఁడగు జోగివంతులుయుక్తిఁజూడమీకు
సుగ్రీవుఁడయ్యెనే సారిది గోయందొర కస్తానుఘనుఁడు మీకార్యమునకు
ఘనఋశ్యమూకమయ్యెనె రాజమహేంద్రవర మెన్నమీమనోవాంఛదీర్ప
గాక యుండిన నిచ్చటికిరాక కేమి
కారణం బెన్నమీవంటిఘనుని కరము, భద్ర. ౪౧

జోగివంతులకు మెచ్చులు వల్లఁబోతివో యింగిరీజులప్రాపు నిచ్చగించి
తురకరూపము దాల్చుశజీవద్యనోమ్లేచ్ఛసంహార మొనరింప జగమెఱుఁగ
శాఖామృగంబుల జతగూర్చ ఋశ్యమూకముఁ జేరఁబోవుటో క్రమముతోడ
నన్నుధన్యునిఁజేయ వాచేతఁబద్యము ల్చెప్పింపఁబూనుటో యొప్పమీకుఁ
గాక యిదియేమివింత ముల్లోకములను
వలస వెంచేసితిరటన్న నలుసుగాదె, భద్ర. ౪౨

అయంగ మీకు భద్రాచలం బయ్యెనే పాలుపుమీఱఁగ రాజుపోఁ వరము
కోవెలప్రాకారగోపురా లయ్యెనే తలుపుఁ లేని కన్నడకవీళ్ళు
కళ్యాణమండపాగారంబు లయ్యెనే సంతమామిళ్లలోఁ జప్పరములు
భువినెన్నఁగా రథోత్సవ మయ్యెనేమీకు వాహనరహితప్రవర్తనంబు
మేలు రాజ్యంబు తురకలపాలు చేసి ౪౩
హరవృషభమధ్యమున నుండుటన్ మహోసనె, భద్ర.

గోవిందరాజులు గురులఘుత్వము మదిఁ దలఁపక మీ వెంటఁ దగిలె నెట్లు
రంగనాయకులు శ్రీరంగాధికారంబు నెఱుఁగక యేరీతి నేగుదెంచె
నరసింహుఁ డుగ్రంబు నట్టేటిలోఁ గల్పి వెడఁగుగా నెటువలె వెంట వచ్చె
క్షేత్రపాలకుఁడైన శ్రీరామలింగంబు ప్రమథులతో నెట్లు పాఱిపోయె
నహహ పావనగుణము వీరందఱకును
సంభవించెనుగాఁబోలు జగమెఱుంగ, భద్ర. ౪౪

బిబ్బీలసిబ్బెంపుబిగువుగుబ్బల నీకు వజ్రాలపతకముల్ వఱలవలెనొ
పారసీకాంతలపావల్లయందు నీముత్యాలచేరులు మురియవలెనొ
తురకబిత్తరులపొదుఖుముల బంగారు మొగలిరేకులు వేడ్కముడునవలెనొ
యవనాబ్జవదనల నవకంపుమేనులఁ బీతాంబరంబులు పెనఁగవలెనొ
కాకయిదియేమి నీసొమ్ములోక మెఱుఁగ
మానవులు వేగహరియించి మన్నఁగలరె, భద్ర. ౪౫

తూర్పునాఁటితెనుంగుదొరతనంబులుగావు తోమాలెలందినంతోషపడను
దక్షిణదేశపుఁ దమిళసాములుగారు వినియోగములు గొని వేడ్కఁజెంద
పశ్చిమమహారాష్ట్రప్రభువరేణ్యులుగారు పాదతీర్థంబున మోదమంద
నుత్తరదేశపుటోఢ్రరాజులుగారు దర్శనమాత్రానఁ దనివి నొంద
యవను లర్థాతురు లటంచు నవమెఱుంగి
వస్తువాహనవిభవము ల్వదిలి తహహ, భద్ర. ౪౬

ధీమంతు లెల్లను దెప్పించుకోక రారో మీస్థలానకు రూఢిమెఱయఁ
గాలుపంపించక కదలరో మీ మొఖాసాల కెల్లను గడు శాశ్వతముగ
సనదులు పుట్టక చనుదెంచరో యగ్రహారికు లెల్లమహాదరణల
వరుసతోడుత పరవానాలు లేక వే చేయరో భూసురశ్రేణి కెల్లఁ
దురక లెల్లను మీత్రోవ ద్రొక్కకుండ
ధరణి తాఖీదులిచ్చక తరలినారు, భద్ర. ౪౭

ద్వాత్రింశదాయుధోద్ధరణంబు గావించి నేఁడు పాదుకలు పట్ట నేరవైతి
సకలదానవులను సంహరించుపెఱెంగి తురకలతోఁ బోరనెఱుఁగవైతి
కుక్షిలో లోకముల్ కుదురుసేయుట నేర్చి వరుససొమ్ములు దాఁపనరయవైతి
పదునాల్గులోకముల్ పాలించుటెఱింగి నీకు రాజ్యము గావ నేరవైతి

యవనిఁ దెల్లనివెల్లఁ బాలనుచుఁ నమ్మి
మోసపోతిరి గర్వంబు మొదలఁ ద్రొక్కి, భద్ర. ౪౮

అగ్నివర్ణాదిభూపాలాగ్రేసరులకంటె మిక్కిలే సోల్దారు లక్ష్మణముగ
వృశ్చికరోమాదిభీకుల కిముమడే సిఫసుషేణులు పిద్దిబలము
ఇంద్రజిదాదుల కెక్కుడే తలపోయ ధరణిలోపలఁ గుమ్మదాను లరయ
నవనిరాక్షసమూయ కధికమే లెక్కింప మొగలాయి మర్మము మొగిఁదలంపఁ
బూనఁగఁ ద్రేతాయుగంబు రక్కసులకంటెఁ
గలియుగమునాఁటి తురకలు ఘనమె మీకు, భద్ర. ౪౯

కపులచేఁ గలిపింపఁ జపలదైత్యులు గారు జెంజరీపుల్కాల చెడుగుదొరలు
తాళ్ళచే నడిపింప రాక్షసావళి గాదు వడినెన్న బారుజవానుగములు
లగ్గలువట్టింప లంకాపురముగాదు మహిని జావరగడీమహలుగాని
పిలిచి కొల్వీయ విభీషణుండిలఁ గాఁడు బిగికల్లు అలియారు బేగుగాని
చేసితివి మ్లేచ్ఛులతో పగచేసి వెలుపు
గలపఁ బూనియు వెలచినక్రమము దోఁప, భద్ర. ౫౦

పితృవాక్యమునకునై పినతల్లికోరికి గడుపఁగా నేరీతిఁ గడగినావో
కడఁగినవాఁడవై ఖరదూషణాదిరాక్షససమూహము నెట్లు చదిపినావో
చదిపినవాఁడవై శాఖామృగశ్రేష్ఠు నేరీతి బంటుగా నేలినావో
యేలినవాఁడవై యెటువలెఁ గపులలంఘన వార్ధి నేక్రియఁ గట్టినావో
కట్టి లంకాధిపుని నెట్లు కొట్టినావో
యిట్టిధైర్యము గలదొరవట్టివరయ, భద్ర. ౫౧

సోమకాసురునితోఁ జొచ్చి పాథోరాశి మత్స్యమై సుఖలీల మరగినావో
కూర్మరూపముచేతఁ గుంభినిఁ జొరఁ బాటి వ్రేగుచే బైటికి వెళ్లలేవో
వరహా(హ)వతారమై వసుధకో రాడిన సిగ్గుచే మూలలఁ జేరినావో
బాలునివల్లు వెంబడి వేగరా నుక్కుఁ గంబంబులో డాఁగఁ గడఁగినావో
కాక నిజరూపమున నున్న ఖలులు నీయు
చేతులకు నూరకుంటివే చేయమఱచి, భద్ర. ౫౨

బలిచేత దానంబు ప్రార్థింపఁ బోతివో కబ్జరూపముచేతఁ గుటిలబుద్ధిఁ
బరశుహస్తుండవై పార్థివావలి ద్రుంచి ధరయేలఁ బోతివో ధర్మరీతిఁ
మునువటివనవాసమునఁ జెందియా యాసమును మువుకో బోతివో కుడుపు కొనక
లడకుకి గొల్లబిత్తలలనెత్తి జేరఁ బోతివో కాముకేళి

నహహ బొద్దుఁడవై ఖాను లాగడముచఁ
బేయుచను లన్ని చూచెదు సిగ్గెఱుఁగక, భద్ర. ౫౩

అవనిలో పలఁ గాలయవనునినాఁటి నీపాఱుఁబోతుగుణంబు పాయదయ్యెఁ
గోఁచిబాఁపండవై కోరిన బలినాఁటి ముంకిఁబిచ్చపుబుద్ధి మానదయ్యెఁ
బరఁగఁగఁ బితృవాక్యపరిపాలనమునాఁటిదుడుకకట్టితనంబుతొలఁగదయ్యెఁ
బండాలచెంత దుర్భాషలాడెడినాఁటి పుకమిమొండితనంబు పోవదయ్యె
నేఁటికైనను నే నన్నమాట వినక
తొలఁగి యిట్లుండుటకు నేమితోఁచదకట, భద్ర. ౫౪

తాటిపండులుఁదిని తఁసినవారికి శాల్యన్నమున్న మెచ్చటము కాదె
దుంపతూఁడులు దిని దొర నన్న వారికిఁ బరమాన్నమున్న సంబరముగాదె
తపుడు రొట్టెలచేతఁ దపము చేసినవారి కతిరసాలన్న నెయ్యంబు గాదె
నారచీరలు గట్టినట్టి వారికిఁ బట్టుపీతాంబరము లన్నఁ బ్రియముగాదె
చెంచుబుద్ధియవి దొరగించినట్టి
దొరకు రాజులవిం దన్న దొడ్డగాదె, భద్ర. ౫౫

క్రూరదానవులను జీరినచక్రంబు మొరవలు వోయెనో మొక్కవడెనో
పగతుర శిరములు బ్రద్దలుగాఁ జేయు గద త్రుప్పువట్టెనో కమికెనొక్కొ
రావణాదులమీఁద రవణించు పెనువిల్లు నడిమికి విఱిగెనో నారితెగెనొ
శత్రువర్గమునెల్ల సమయించు పెనుదూపు కాకంబు మ్రింగెనో కాడుపడెనొ
కాక యిదియేమి యవనులు కాఱుచేసి
మండపాగారములు మట్టుమసలి రహహ- భద్ర. ౫౬

తాటకపై నగ్రతరముగా వెడలిన బాణం బదెక్కడఁ *బాసెనొక్కొ
ఘనసుబాహునిబట్టి ఖండించి నైచిన శరమ దెచ్చోటికి నరిగనొక్కొ
చిత్రమృగముమీఁదఁ జిందుచెండాడిన మార్గణం బెక్కడ మడిసెనొక్కొ
వాలిపై నవలీల ప్రాలి జీవము గొన్న యాశుగం బెచ్చట నడఁగెనొక్కొ
యవని యవనులు మీ రాజ్య మాక్రమించి
యేలఁ గొనుచున్నతఱిఁ బాలుమాలితికట, భద్ర. ౫౭

అంగదసుగ్రీవహనుమదాదులకు లల్లుడతాలు తొడిగించుగ నుతుమీఁఱ
జాంబవత్సుముదాదిశాఖామృగమ్ముల గరడియుఁ జిఁపఁగఁ దలంపు

* పాయనొక్కొ.

ముసలముద్గరశూలములు మాన్పిచకును కీబందూఖులుధరింప, బాటిసేయు
పరుస గీర్వాణము ల్వదలించి వేవేగ, దురకమాటలు నేర్పు కలిఱు మీఱి
మీరు దేవత్వము వహించి మీ(అలేరు)
*మీరలునునొండు విధమున రాదు, భద్ర. 99
సూకరరూపంబు సూచనవినిగదా విడిచిపెట్టిరి మిమ్ము వెరవెఱింగి
బలి బిచ్చమెత్తిన బాలపండ వని కదా విడిచిపెట్టిరి మిమ్ము వెరవెఱింగి
ఢిల్లీశ్వరునకైన యుల్లుండ వని కదా విడిచిపెట్టిరి మిమ్ము వెరవెఱింగి
పాఱిపోయెడివారి, బట్టరాదని కదా విడిచిపెట్టిరి మిమ్ము వెరవెఱింగి
కాకయుండిన, దురకల, గడచిపోవ
గలరె మీవంటివారలు క్రమముతోడ, భద్ర. 99
శేషావతారవిశేష మెక్కడ,బోయె లక్ష్మణార్యునకు సలక్షణముగ
శంఖచక్రాన్వయసంజ్ఞ యెచ్చట,జెల్లె భరతశత్రుఘ్నుల కరయ భువిని
లోకమాత్రాఖ్యయేలోకంబులకు, జేరె భూపుత్రికిని నెన్న భూమిలోన
నాదినారాయణాహ్వాయ మదెందుల కేగె రామాఖ్యగల మీకు రమణతోడ,
దురకలెల్లను దొరవని సరకుగొనక
మండపాగారముల మట్టుమసలి రహహ, భద్ర. ౬౦
చెక్కులు నిమురక సీతోర్మిళాదుల, గని యూరకుందురే మనసునిలిపి
పాఱిపోవ,గనైన, బట్టలు నాకక విడుతురే వైష్ణవవితతినెల్ల
బదూకులు బుజాలపై నిల్పి కొనిపోక (యరుగ) నిత్తురె వసిష్ఠాదిమునుల
ముక్కలుగ అవనీ మును మొనగట్టి పోనిత్తురే కపినాయకోత్తములను
మొగలుబచ్చాల కగపడ,దగదటంచు,
దొంగిపోయిలి రిక నేటిదొరతనంబు, భద్ర. ౬౧
సిరలక్ష్మి నురవడి, జెఱపట్టి గీడులో వనలక్ష్మి కరపల్లవములు నులిమి
గంగను గదిసి వేగమె ధైర్యలక్ష్మిని, జేకొని ధనలక్ష్మి చెట్టపట్టి
రాజ్యలక్ష్మిని సంగరమున, బెండిలియాడి ధాన్యలక్ష్మిని సరదార్ల కిచ్చి
ఘనగజాంతర్లక్ష్మి, గైకొని వేవేగ, గీర్తికాంతకు, గులగిరులొసంగి
పట్టి"దంసాను"శిక్షింప నలవిగాక
యెడుగుకొంటివి నృపతుల,గడుపుకొఱకు, భద్ర. ౬౨

*మీరలను యెుండ్డు విధమున ననరాదు—మూ.

హరువిల్లు విఱువక వరపుత్రి నియనన్న జనకరా జేమి విచారపడెనో
పరశురాముని భంగపఱుపఁగా నొచ్చిన దశరథుఁ డేరీతిఁ దల్లడిలెనో
మిముఁ గాపుచేసి యాగము పూర్తిచేసిన కౌశికుఁ డేమివ్యగ్రతగొనియెనో
వనరాశిఁ గట్టి రావణుఁ ద్రుంచఁగనిన విభీషణుం డేరీతి వెగడుపడెనో
తురకబలకోటి(గాంచి) చూతురతఁ బోల
వరము వేంచేసినట్టిదుర్వార్త వినిన, భద్ర. ౬౩

పరుసఁ గోడలి దురవస్థలు విన సారెఁ గౌసల్య యేగతి గాంచెనొక్కొ
మీశ్రమ మెల్ల సుమిత్ర యాలించి గాసిలి దుఃఖవారాశిఁ జేరెనొక్కొ
కలకాల మీరీతిఁ గడపఁగాఁ గాలంబు విని విందు లేమని వెఱచిరొక్కొ
గతకాలమునఁ బండ్లు కానుక లిచ్చిన శబరి యేగతిఁ జింత సలిపెనొక్కొ
యహహ భద్రాద్రినుండి మీరరిగి పోల
వరము వేంచేసినట్టి దుర్వార్తవినియు, భద్ర. ౬౪

ఆదిభిక్షునిఁ బెండ్లియాడిన పార్వతి కన్నవస్త్రముల కేమాపదయ్యెఁ
గోరి బావనిఁ జేసికొన్న సరస్వతి కిడుమలు వచ్చెనే యిల్లు లేక
కాళ్ళు లేనిఫణీంద్రుఁ గట్టికొనిన యుర్వి కూరు లేదాయెనే యుండుటకును
దనువు లేని వయారిఁ దగిలిన రతిదేవి సుఖపడ దాయెనే సురలు మెచ్చ
బళిరె మీవంటిప్రభుచెట్టపట్టి సీత
సకలవెతలకు లోనయ్యె సరవిలోన. భద్ర. ౬౫

పొరుగిండ్ల వెంబడిఁ దిరుగుచునుండులక్ష్మీదేవి కేమపకీర్తివచ్చె
సభలలో నెప్రొద్దు సంచరించుచునుండు వాణి కేమపవాద వచ్చెజగతి
వేలార్లు మనువుల కాలయమైయున్న భూదేవి కేమితప్పులు ఘటిల్లె
శివునిఁ బాసి సముద్రుఁ జెందిన పార్వతిసవతి కేమాడిక లసంభవించెఁ
దోడు నీడయి మీవెంటఁ గూడియున్న
సీతదురవస్థ లేమని చెప్పఁదరము, భద్ర. ౬౬

జనకుఁ డిచ్చిన బన్నసర మటంచును జూపి తెల్పు సీతామహాదేవి యిష్ట
జనులతో నూర్మిళ తనతల్లియొసఁగిన పచ్చలతాళని పల్కుఁ బ్రాణ
సఖులతో మాళవి సరవిఁ గెంపులనత్తు గని మఱియు, బంధు
వర్గంబులో జాళువావల్వ శ్రుతకీర్తి మేనమామయొసంగె మిథిలయందు
ననుచుఁ గొనియాడుఁ బుట్టినింటిఘనత మెఱయ
వారి నరీతి నో దాన్పవశము మాకు, భద్ర. ౬౭

గజరాతికెంపులకుంటెఘ్లు చెవుల ధరించదామెఁ గదయ్య వాంఛదీర
వరుణదేవుఁ డొసంగు వజ్రాలకమ్మలు పెట్టదామెఁ గదయ్య ప్రేమదీఱ
నలకుబేరుఁడొసంగునద్దాలఱవికపైఁ దొడుగదామెఁ గదయ్యయొడలునిండ
గట్న మింద్రుఁ డొసంగు గంటలమొలనూలుకట్టదామెఁ గదయ్యకాంతదీఱ
వేడ్క దినముల నడవుల వెంట (మీరు)
ద్రిప్పితిరి సీత నూరకె తప్పులేక, భద్ర. ౬౮

తెచ్చితికీర్తిఁ గీర్తివిశారదులగు నిక్ష్వాకువంశోద్భవఘనులకెల్ల
నేలితి వవనిలో నెలమి శంకరగిరి హానను బాదాలు మహాత్మ్యతముగఁ
దోలితి వరుల హద్దులు దప్పిరాకుండ భక్తకోటికి ముగ్ధభావ మలర
... ... ... ... ...
ఏమి వర్ణింతు మీపాత్ర మేమనెంతు
లోకులెఱుఁగంగ నీమూఁడులోకములను, భద్ర. ౬౯

అలపాకశాసను నైననుయాచించి చేయించు ముత్యాలచేరుచుక్క
రమణతోడుత ధర్మరాజుకు దయపుట్ట నడిగి చేయించు ముత్యాలనత్తు
వరుణదేవునినైన వరుసతోఁ బ్రార్థించు కలకొద్దిఁ జేయించుఁ గమ్మజోడు
రాజరాజును (వేఁడు) తేజంబుతోడను నిప్పించు నవరపుఁ గొప్పు ముడిమ
పేదపోణులు లివిమైనఁ బెట్టుకున్నఁ ౭౦
జూపరులకెల్ల నత్యంతచులకఁదనము, భద్ర.

ఇల్లు నవ్వులగంప యిల్లాలు చలచిత్త పాన్పు నాగులపుట్ట వదినె జెట్ట
గొల్ల మెప్పు మతల్లి కోడలుఱాఁగ కూఁతురు పాముఁబోతు నాతురుఁడు సఖుఁడు
మనుమఁడుతంత్రి కామకుఁడు కుమారుండుక్షయరోగి మఱఁది వంచకుఁడు తండ్రి
యన్న పానఘనుండు నరయనిష్టుఁడు పేఁడి వేసదారివి నీవు వేయు నేల
యిన్నియును నాదు నెమ్మది నెఱిఁగియుండి ౭౧
కొలిచితిని మిమ్ము విశ్వాసగుణముదలఁచి, భద్ర.

పన్నీరుసీసాలఁ బరఁగ నించినరీతి నెనయఁగప్రపుమహారత్నభాతి
వరుసముత్యాలకోవలు గ్రుచ్చినక్రమంబుమల్లెపూసరములుమలఁపుమాళ్ళి
విరజాజిపై సుధావృష్టి దోఁగినగతిఁ గస్తూరి వీణియల్గులుపుపోల్కి
పరఁగనవదాతు (?) గంపలు వ్ర...బు తేనె బానలు తెరలీసినట్లు

నీదు నామామృతంబు నానేర్చినంత
కొల్లలాడెద భక్తులు నుల్లసిల్ల, భద్ర. ౭౨

సర్వమొఖాసాలు చాలని మీ కిలఁ గట్టడి నేరీతిఁ గడచెనయ్యా
బహ్వవసరముల భక్షించు మీ రెట్టు లొక్క ప్రొద్దున కోర్చి యుంటిరయ్యా
సంగీతసాహిత్యసద్గోష్ఠిగలవార లొంటి మీ రెట్లొదిఁ గుంటిరయ్యా
తిరువీథు లెడపక తిరిగెడు మీ రెట్లు కడపదాఁటక ప్రొద్దుగడపితిరహ
వాహనంబులపై నుండువారి కకట
యోడపై నెక్కఁగానెట్లు గూడెనయ్యా, భద్ర. ౭౩

పదియు రెండేఁడుల ప్రాయంబువాఁడవై మించు తాటకను శిక్షించు టెట్లొగి
రణశూరు లగుదైత్యగణములఁ బరిమార్చి కౌశికు జన్నంబు గాచుటెట్లొగి
తరములఁబట్టి యెత్తఁగరాని హరువిల్లు చెఱకువైవడి నట్లు విఱుచుటెట్లొగి
సంగరరంగవిశారదుఁడైన భార్గవరాము నవలీలఁ గడపుటెట్లొగి
దూఱితిని మిమ్ము రోషంబు దొట్టి రిపుల
మదమడంగించునట్టి సమ్మదమెలర్ప, భద్ర. ౭౪

ప్రారబ్ధ మనుభవింపనిభక్తజనముల యాతనల్ త్రుంపఁగ మీ తరంబె
కారణహేతువికారము ల్తప్పించి యధికులఁ జేయ మీ కయ్యతరమె
మిముఁ దొల్లి పూజించి మీవరంబులు గొన్న ధంసాను గెల్వ మీ తాతతరమె
గతజన్మమునఁ బెట్ట గతిలేక పుట్టిన దీనులఁ బ్రోవ మీ దేవుతరమె
యనుచు జనులెల్ల మిము నాడ వినఁగలేక
దూఱితిని నాదు నేరముల్ తొలఁగఁజేయు, భద్ర. ౭౫.

ఈతనా ధంసాకు నెదిరి పోరఁగలేక పాఱిపోయిన రామపార్థివుండు
ఈతఁడా యడికి వెన్నిచ్చి పోలవరంబు దారిఁజూపిన సుమిత్రాతనూజుఁ
డీబిడా కలసొమ్ము లిచ్చి మ్లేచ్ఛుల బాధ పతికిఁదప్పించిన పడఁతి మిన్న
యీతఁడా పగదళం బిదె వచ్చె నని చూపి భయము పుట్టించిన పావనియని
పల్లుదురుసామి మిముఁ జూచి ప్రజలు కార్య
పరుస మెఱుఁగక కోపింప వలదు తండ్రి, భద్ర. ౭౬

పిఱికివాఁ డంటేఁగా కఱకు దానవులను గర్వమడంచిన ఘనుఁడ నిన్ను
లోభివాఁ డంటేఁగా లోకంబు లెఱుఁగంగ లంక దానముసేయు రాజ నిన్ను
బలహీనుఁ డంటేఁగా బలిమి సముద్రుని [illegible] క్రమున [illegible] బాణ నిన్ను

వెట్టివాఁ డంటిఁగా వెరవెఱుంగని క్రోఁతిగములచే వారిధి గట్టినట్టి
మిమ్ము లోకోపకారార్థ మెన్నఁబూని,
దూటితిని గాక మీవంటి దొరగలండె, భద్ర. ౭౭
అలకుచేలుని చేరెఁ డటుకులు భక్షించి సంపద లొసఁగిన సరసగుణుఁడ
గజరాజు మొసలిచే గాసిలి మొఱవెట్టఁ గాచి రక్షించిన కమలనాభ
కలఁడన్నఁ బెన్నుక్కుఁగంబంబులోనుండి వెడలి బాలుని గాచువీరవరుఁడ
తలఁచిన ద్రౌపదితలఁపు వెంబడి మానభంగంబు గాచిన ప్రభువరేణ్య
లోభివంటిని బగరకు లోఁగితంటిఁ
బిఱికి వంటిని నేరక యుఱికితంటి, భద్ర. ౭౮
వగతుఁడై బహుఫణార్భటిఁ జేర వచ్చిన కాళీయుదైత్యుని గావలేదె
సీతను జెఱగొన్న పాతకాగ్రేసరునను జుని శరణన్న మనుపలేదె
మీశరణార్థియై మెలఁగి కావు మటన్న కాకాసురునితప్పు గడపలేదె
* * * * * * *
పృథివి శరణాగతత్రాణ బిరుదుగలుగు
దొరవనుచు మిమ్ముఁ బలుమాఱు దూఱినాఁడ-భద్ర. ౭౯
పితృకార్యమునకునై పినతల్లి కోరికె వెఱవక తీర్చిన వేల్పు నిన్నుఁ
బదరేణువ నహల్య పాపంబు లెడఁబాపి విభునిఁగూర్చిన సత్యవిభుఁడ నిన్ను
దగఁ గన్నఁ బగవానితమ్ముని లంకలోఁ బట్టంబు గట్టిన ప్రభుడ నిన్ను
ఘను సుబాహుని బట్టి ఖండించి కౌశికునవముఁ గాచిన సర్వసముఁడ నిన్ను
భక్తలోకోపకారార్థపరుఁడనగుచు
దూటితిని నాదు నేరంబుఁ దొలఁగఁజేయు-భద్ర. ౮౦
చిలుకకు మాటలు చెప్పు రామాయని చేడియ మోక్షంబు చెందలేదె
వరుస దాటులుదోఁచి వాల్మీకియు మరమరాయని మీఁకృపఁ బ్రబలలేదె
పతిశాపగతినుండి పాదరేణుపుసోఁకి పాషాణమింతియై వరఁగలేదె
* * * * * * *
పృథివి శరణాగతత్రాణబిరుదు నీదె
కాక యితరుల కెుద్దైనఁ గలుగఁ గలదె-భద్ర. ౮౧
కందెనేమో నాదుశక్తినచ్చిత్తమునందు నిలిపిన నీపదనీరజములు

అంటెనేమో నాదునఘశేశ మాత్మలో సంచరింపఁగ మీనఁ జమటలూరి

పోఁకిలనేమో నాదుచుఱుకులోఁజూపులు చూచుచుండఁగమఖసుందరంబు
* * * * * * *
సామి యిఁక నేరములు నీరసంబు చేసి
కాచి రక్షించు నన్కృప గడలుకొనఁగ-భద్ర. ౮౨

కొల్లలాడితినని కోపింపఁ బోకుఁడీ యవని మీదివ్యనామామృతంబు
వీటిఁబుచ్చితినని వింతగాఁగనకుఁడీ కృతులందు మీగుణకీర్తనములు
కాడుచేసితినని కంటకపడకుఁడీ మీఁటి మీదివ్యకథారసంబు
ఎఱుఁగఁబల్కితినని యెగ్గుగాఁ గనకుఁడీ మహిని మీమహత్కర్మంబులెల్లఁ
బుచ్చి పెట్టితి నని కోప గించవద్దు
సరస మీపద్యముల్ చెప్ప సంతతంబు-భద్ర. ౮౩

వేయికన్నులుగల్గు వేల్పుతేనికినైనఁ గనుఁగొనరాని శృంగారరూప
వేయినోరులుగల్గు వీచులకంటికైన వచింపరాని యనంతనామ
వేయిచేతులుగల్గు వేఁడివేల్పునకైనఁ (బోల్ప) రా నబ్బని పుణ్యమూర్తి
వేయిరీతులుగల్గు వేదంబులైనను బ్రస్తుతిసేయ నేర్పడనిచరిత*
తగుదు నని నాదు మూఢచిత్తమున నిన్ను
నిల్ప శక్యంబె నావంటి యల్పునకును-భద్ర. ౮౪

పనివట్టితేనొక్కపవసుఁడు చనుదెంచి యరిబలంబులను జక్కాడలేదె
సైవిచ్చితే నొక్కబలిమిని నీలుఁడు నని విరోధులఁ దెగటార్పలేదె
యానతిచ్చిన నొక్కయంగదుఁ డెదు రేఁగి పగతురయసువులు పాపలేదె
* * * * * * *
స్వామి సాత్త్వికరూప విచక్షవరుల
†నోర్చితిరిగాన తురకల యెదుట దెంత-భద్ర. ౮౫

వలసీలకుముదసేనానాయకోత్తముల్ బలసి ముంగల బరాబరులు సేయ
హనుమయు జాంబవ దంగదాదులు నిల్చి యంచలంచలను జోహారులిడఁగ
వరుస సుగ్రీవగవయగవాక్షులు నొరసి మిన్నంటి చామరలు వీవఁ
బరమభాగవతఖేచరసిద్ధచారణుల్ జయజయశబ్ద...ములు నుడువ
సురలు విరులు గురియఁ బోలవరమునుండి
భద్రగిరి కేఁగు వేడ్కను బ్రస్తుతింప-భద్ర. ౮౬

*పాఠాంతరము—నిప్పునుతి కెక్కరాని బ్రాజమువులనుకునైనను నెప్పడనిచరిత్ర- అని.
†మోర్చితిరిగాక తుర్కుల నుపాటి కల్ల-మా

అంగ వంగ కళింగ బంగాళ నేపాళరాజుల కెల్ల శ్రీరాములాజ్ఞ
గూర్జరకర్ణాట కుకురకొంకణచోళరాజులకెల్ల శ్రీరాములాజ్ఞ
చోటసింధుమరాటలాటమత్స్యవిదర్భరాజులకెల్ల శ్రీరాములాజ్ఞ
పాంచాల సౌరాష్ట్ర బర్బరమగధాంధ్రరాజుల కెల్ల శ్రీరాములాజ్ఞ
దివ్య తిరునాళ్లకు సమస్తదేశవరులుం
రావలయు నంచుఁ జాటింపఁగా వలయును.భద్ర. ౮౭

శ్రీరామచంద్రులు సీతాసమేతులై వచ్చిరి భద్రాద్రివాసమునకు
జయనామవత్సర చైత్రశుద్ధాష్టమి తరవాతిదినమందుఁ దగవివాహ
మరయమార్గమునందునెరయసత్రములుబల్చలువపందిరులువెచ్చనిజలములు
శీతోదకంబులు చిక్కని మజ్జిగల్ నిమ్మపండ్లరసంబు నీరుచల్ల
లాదిగాఁగల్గుద్రవ్యంబు లమరఁజేయ
వలయునని వేగఁబంపుఁడీ వాయుసుతుని, భద్ర. ౮౮

తిరిగి రాముఁడు భద్రగిరికేగువార్త లాలించెనా వజ్రితాళీలొసంగు
నవనిజాధిపుఁడు భద్రాద్రిఁ జేరుట వినఁగల్గెనా జముఁడు చౌకట్లొసంగు
దశరథాత్మజులుం స్వస్థానంబు కరుగుట వినియెనా వరుణుఁడు మణులొసంగు
భరతాగ్రజులు నిజపురము కేతెంచుట లెఱిఁగెనా ధనముధనేశుఁ డొసఁగు
ననుచు నలనీలజాంబవదాంగదాదు
లమరి యున్నారు శుభవార్తలరసిచెప్ప, భద్ర. ౮౯

కలిమిచే విబుధులఁ గానసరనివారి వారించు గుణశాలి వదినెగారు
నెఱిఁ బేదనైనను నిల్పి చేపట్టియు ధీమనిఁ జేయుపత్నీలలామ
పతితాత్ము నైనను బావనుగాఁజేయు గుణవతి ముద్దులకూఁతు రరయ
నవివేకు నైన విద్యావంతునిగఁ జేసి గురురూప మొనరించు కోడలెన్న
నిట్టిసంపత్తి గల మిమ్ము నెఱిఁగి భక్తిఁ
గొలిచితిని వేగ నాకేమి కొదవయింక, భద్ర. ౯౦

దయశాలితల్లి యుదారసాహసుఁ డప్ప భూభారకుఁడు శయ్య పుష్పబాణుఁ
డరయఁబుత్త్రుఁడు శీతకరుఁడు మఱంది వాసవసూను డిష్టుఁ డైశ్వర్యయుతుఁడు
నెచ్చెలి దేవమాసి దలంప మనుమఁడు రత్నాకరం బిలు రమణ నెన్న
రణశూరుఁ డన్న సారసనేత్రి వర్ణింప నవతారమూర్తి వీవవనిలోన
నిట్టి మిముఁగొల్చునామది కితరబుద్ధు ౯౧
లమర నర్చుని యన్నమ్ములైన, భద్ర.

వరుస విద్యలు చెప్ప వదినె సరస్వతి యాయువుదయసేయ నన్నయజుఁడు
ముదమీయ నక్షత్రములు మేనయత్తలు మాకిష్టమిడఁ జందమామమామ
యరసిపాపముఁ బాప నప్ప దివిజగంగ యైశ్వర్యమొసఁగ శ్రీహరుఁడు బావ
మాతల్లియుల్లోకమాత కల్మషదీనపోషకుఁడవు తండ్రి పొసఁగ నీవు
ఇన్నియును నింటఁగలుగుట యెఱిఁగియితర
దైవములవేఁడనాకేల దైవరాయ, భద్ర. ౯౨

బలుసాకువ్మెకి ద్రౌపదిచేత వనములోఁ బాండవావలిని గాపాడినట్లు
సరవిఁదెచ్చినపండ్ల సారంబనుభవించి చెంచుముద్దియను రక్షించినట్లు
అడిగితెచ్చిన ముక్కుటడుకులు భక్షించి చెలఁగి బాఁపని ధన్యుఁ జేసినట్లు
పెట్టఁగానని తౌటిరొట్టెకు బతిమాలి ముసలియవ్వకుఁ గీర్తి యొసఁగినట్లు
పూనపాటినృపాలురఁ బ్రోవఁదలఁచి
తెచ్చుకొంటిరొ మీకుచ్చు వెచ్చములకు, భద్ర. ౯౩

గోత్రికు లని పాలు కొట్టిపోలేక మీయంశభూతులటంచు నడిగినావా
పేరుమోసినకట్న మారసికొంటివో శూరులనుచు సంపఁ జేరినావా
మీనౌఖరులలోన మాతి వస్మిటుఁదెచ్చె నని చూపివ్యయమున కలిగినావా
స్థలము వంశంబు మీ రొయనిపోలికఁ బలుకష్టసుఖంబులఁ దెలిపినావా
యెట్టుదయచేసిరయ్య మీవట్టుమీకుఁ
బూనపాటికులోద్భవు బాసయెఱిఁగి, భద్ర. ౯౪

రవికులోత్తమ దశరథ రాజనందన తాటకామదవిమర్దన మునీంద్ర
మఖపరిపాలన, మారీచహర, యహల్యాశాపమోచన, హరశరాస
నవిభంగజానకీనాయక భార్గవరామ గర్వాపహార సుగుణాఢ్య
పితృవాక్యపాల విపినశైలసంచారక కురంగభంగక కపివపాల
వాలిమదభేద వారిధిబంధన......
దశము ఖకులవనదావ త్రిదశవంద్య, (?) భద్ర. ౯౫

సద్ధర్మచారిత్ర...........శ్రీధరపుణ్యగాత్ర సీతాకళత్ర
కరుణాలవాల శ్రీకరభక్తపాల సన్నుతమానిజాల యుచితసుశీల
పరమపవిత్రశంబరవైరిచిత్ర వాసవమాన్యగోత్ర విశాలనేత్ర
రఘుకులదీప నిర్గళితశంకర చాప సుందరరూప విశ్రుతప్రతాప
రణజయాలాప దైత్యమర్దనకలాప
మానిమానససారసమిత్రమధుర, భద్ర. ౯౬

రణభీమ దైత్యమారణహరోమ పుణ్యకారణనామ వినుతచారణలలామ
వనచార పతితపావనశూర మానిభావనపూర వీరరావణకుఠార
జనరక్ష కృతపుణ్యజనశిక్ష వరభక్తజనపక్ష సత్పవిత్రయోజననిరీక్ష
జితదోష మానిపూజితశేషశయన వారధిశోష పార్థసారథ్యవేష
సరసగుణధామ రవికులసార్వభౌమ
దశరథసుపుత్ర దేవ సీతాకళత్ర, భద్ర. ౯౭

వరరూపలావణ్య వైభవార్తశరణ్య దేవాగ్రగణ్య పార్థివవరేణ్య
ఘననీరదనిభాంగ ఖగనాయకతురంగ విజితహేమకురంగ వృజినభంగ
మానిమానసభృంగ మథితఘోరభుజంగ పరిపాలితప్లవంగ ప్రణుతగంగ
భక్తవనజమిత్ర పావనచారిత్ర శతముఖస్తోత్ర కౌసల్యపుత్ర
ధర్మగుణసాంద్ర రఘుకులతారకేంద్ర
సవనసంరక్ష యాశ్రితజనసుపక్ష, భద్ర. ౯౮

విలజాక్ష ఘనరాక్షసవిశిక్ష మునిపక్ష రణశూర వనచార రఘుకుమార
యతిశోష మునివేష సురపోష మృదుభాష రఘుపుంగవ భుజంగరాజభంగ
శరచాపధర పాపహర భూపకులదీప రతిరాజజయతేజ హితసమాజ
మురభీమ సురసోమ వరనామ గిరిధామ సురపుంగవశుభాంగ సుప్రసంగ
భక్తపరిపాల గుణజాల భవ్యలీల
దివ్యమంగళవిగ్రహ దీనరక్ష, భద్ర. ౯౯

శరణు త్రిలోకరక్షణ మానిసన్నుత శరణు సద్భక్తరంజనచరిత్ర
శరణు విశ్వామిత్ర సవనసంరక్షణ శరణు గౌతమపత్నిశాపహరణ
శరణు మారీచభంజన వార్ధిబంధన శరణు ప్లవంగపోషణముకుంద
శరణు వైకుంఠవాస విశాలలోచన శరణు ఇక్ష్వాకువంశజ మహాత్మ
శరణు వాసవనుత శేషశయన శరణు
శంఖచక్రగదాఖడ్గశార్ఙ్గహస్త, భద్ర. ౧౦౦

రామదాసాదుల రక్షించినట్టులు నెలమితోడఁ గుచేలు నేలినట్లు
ప్రహ్లాద నారద ప్రభృతిఁ బ్రోచినయట్లు సరవితో ముచికుందు సాఁకినట్లు
అలద్రౌపదికి వల్వలాదుకొన్నట్టులు గజరాజు నవవిలోఁ గాచినట్లు
శబరివిందుఁకు సంతసమ్ము నొందినయట్లు మహాఘంటకర్ణు మనిచినట్లు

నన్ను దయనేలు నేరము లెన్న కవని
మూఢచిత్తుఁడ నవివేకములు హరించి, భద్ర. ౧౦౧

సర్వథా రనుపేరిసంవత్సరమునను ధంసాకు వెఱచి యిద్దఱికి వచ్చి
పోలవరంబులోఁ బాలుపొంద నైదేండ్లు వనవాస మొనరించి వరుసతోడ
శాక్తేయమతయుతు సంహార మొనరించి మంత్రాంగశక్తి యిమ్మహిని వెలయఁ
దగఁ బూసపాటి సీతారామరాజు విజయరామరాజుల సరసముగను
విజయసంవత్సరంబున విజయముగను
భద్రగిరికేగి తౌనయ్యభద్రముగను, భద్ర. ౧౦౨

మొదలఁ గావ్యము లేశమును బఠింపఁగలేదు శబ్దజాలముల వాసనయెఱుంగ
ధరవిభక్తిజ్ఞానసరణి యేమియు లేదు లక్షణశక్తి చాలదు తలంప
గ్రంథశోధకుఁడను గాను వ్యాకరణసూత్రము లవలేశమాత్రము నెఱుంగ
నవని నీదివ్యనామామృతాసక్తిచేఁ బూనితి నీకావ్యబూటకంబు
మున్ను నన్ను మరామరాయన్నఘనుని
వగిది దయఁ జూడవలయు నాపదలు ద్రోలి, భద్ర. ౧౦౩

నదులు మున్నీటికై యదనిచ్చి పాఱుచో నెదురేగు మీనము ల్గుదులుగూడి
వనవసంతాగమదినములఁ గోయిల ల్మొగమిచ్చి పల్కును వగలు గులుక
సరవి మేఘోత్పత్తిసమయంబున నెమిళ్ళు పురివిచ్చియాడు నంబరముగాంచి
సిగిగల్గువేళలఁ బరమదయాళులై పురిబంధుజనములు పూజచేతు
రిలర కాలంబులను వార లెగ్గుసేతు
రేమి వివరింతు మాయల సామినేఁడు, భద్ర. ౧౦౪

రమణతోఁడుత నిభరాహిముఖానుని నేల పుట్టించెనో యిలను బ్రహ్మ
పుట్టించెఁ గక యాపుడమిలోపల నేల ఫాజిలం బేగని పల్కఁజేసెఁ
బల్కఁజేసినవాఁడు కదవిచాలయొసంగి లీల జాల్టుంగు పేరేల తెచ్చెఁ
దెచ్చినవాఁ డేల దృఢచిత్తుఁగాఁజేసి ధంసా యను కితాబు ధరణి నొసఁగె
నొసఁగి మిము గెల్చు సాహస మొసర నేల
చేసెనో యని మదిఁ జింతసేయవలదు, భద్ర. ౧౦౫

రమణఁ గౌండిన్యగోత్రపవిత్రుఁడను లింగనకుఁ బౌత్రుఁడను పెద్దనకును బుత్ర
వరుఁడఁ జేరయనామధరుఁడ కల్లూరి ... బుధవర్గ మలర

వలసవేంచేసిన వసన యాస్పదముగా మదిలోన భావించి ముదమెలర్ప
ఘనత వ్యాజస్తుతిగా నొనర్చితి నీసశతక మష్టోత్తరశతము గాఁగఁ
జిత్తగింపుము హంసంబు క్షీరములను
గ్రాహ్యమొనరించుచందంబు గడలుకొనఁగ, భద్ర. ౧౦౬

కేశవ మాధవ కృష్ణ హృషీకేశ నారాయణ ముకుంద నారదనుత
పద్మనాభాచ్యుత ప్రద్యుమ్న శ్రీధర వామన గోవింద వాసుదేవ
విష్ణ్వనిరుద్ధ త్రివిక్రమాధోక్షజ నారసింహ జనార్దన మధుసూద
న యుపేంద్ర సంకర్షణ పురుషోత్తమ హరే దామోదరానంత దానవాంత
యఖిల లోకైకనాథ దివ్యాంఘ్రిపద్మ
ములకుఁ బ్రణమిల్లెదను ముదమలర నేలు
భద్రగిరివాస శ్రీరామభద్ర దాస
పోషబిరుదాంక రఘుకులాంబుధిశశాంక. ౧౦౭

జయ రఘుకులదీప జయ దశరథపుత్ర జయ భరతాగ్రజ జయ ముకుంద
జయతాటకాంతక జయమఖపరిపాల జయయహల్యాపోష జయయుపేంద్ర
జయ హరధనుఖండ జయజానకీనాథ జయ భృగుసుతభంగ జయకృపాబ్ధి
జయ వనసంచార జయ వాలిమర్దన జయ వార్ధిబంధన జయ మురారి
రావణాంతక సాకేతరమణ నీదు
వలన శతకము వినువారి వలన లుసుగు
భద్రగిరివాస శ్రీరామ భద్ర దాస
పోషబిరుదాంక రఘుకులాంబుధిశశాంక. ౧౦౮

—

నన్ను దయనేలు నేరము లెన్న కవని
మూఢచిత్తుఁడ నవివేకములు హరించి, భద్ర. ౧౦౧

సర్వధారను పేరిసంవత్సరమునను ధంసాకు వెఱచి యిద్దరికి వచ్చి
పోలవరంబులోఁ బాలుపొంద నైదేఁడ్లు వనవాస మొనరించి వరుసతోడ
శాక్తేయమతయుతు సంహార మొనరించి మంత్రాంగశక్తి యిమ్మహిని వెలయఁ
దగఁ బూసపాటి సీతారామరాజు విజయరామరాజుల సరసముగను
విజయసంవత్సరంబున విజయముగను
భద్రగిరికేగి తౌనయ్యభద్రముగను, భద్ర. ౧౦౨

మొదలఁ గావ్యము లేశమును బఠింపఁగలేదు శబ్దజాలముల వాసనమెఱుంగ
ధరవిభక్తిజ్ఞానసరణి యేమియు లేదు లక్షణశక్తి చాలదు తలంప
గ్రంథశోధకుఁడను గాను వ్యాకరణసూత్రము లవలేశమాత్రము నెఱుంగ
నవని నీదివ్యనామామృతాసక్తిచేఁ బూనితి నీకావ్యబూటకంబు
మున్ను నన్ను మరామరాయన్నఘనుని
వగిది దయఁ జూడవలయు నాపదలు ద్రోలి, భద్ర. ౧౧౩

నదులు మున్నీటికై యదనిచ్చి పాఱుచో నదురేగు మీనము ల్గుదులుగూడి
వనవసంతాగమదినములఁ గోయిల ల్మొగమిచ్చి పల్కును వగలు గులుక
నరవి మేఘోత్పత్తిసమయంబున నెమిళ్ళు పురివిచ్చియాడు సంబరముగాంచి
సిగిగల్గువేళలఁ బరమదయాళులై పురిబంధుజనములు పూజచేతు
రిలర కాలంబులను వార లెగ్గుసేతు
రేమి వివరింతు మాయల సామినేఁడు, భద్ర. ౧౦౪

రమణతోడుత నిభరాహిముఖానుని నేల పుట్టించెనో యిలను బ్రహ్మ
పుట్టించెఁ గక యీపుడమిలోపల నేల ఫాజిలుబేగని వల్లఁజేసెఁ
బల్లఁజేసినవాఁడు కదవిచాలయొసంగి లీల జాల్టుంగు పేరేల తెచ్చెఁ
దెచ్చినవాఁ డేల దృఢదిత్తుఁగాఁజేసి ధంసా యను కితాబు ధరణి నొసఁగ
నొసఁగి మిముగెల్చు సాహస మొనర నేల
చేసెనో యని మదిఁ జింతసేయవలదు, భద్ర. ౧౦౫

రమణఁ గౌండిన్యగోత్రపవిత్రుఁడను లింగనకుఁ బౌత్రుఁడను పెద్దనకును బుత్ర
కరుఁడఁ బేరయనామధరుఁడ భల్లానంశ వార్ధిసోముఁడ బుధవర్గ మలర

వలన వేంచేసిన వసన యాస్పదముగా మదిలోన భావించి ముదమెలర్ప
ఘనత వ్యాజస్తుతిగా నొనర్చితి నీసశతక మష్టోత్తరశతము గాఁగఁ
జిత్తగింపుము హంసంబు క్షీరములను
గ్రాహ్యమొనరించుచందంబు గడలుకొనఁగ, భద్ర. ౧౦౬

కేశవ మాధవ కృష్ణ హృషీకేశ నారాయణ ముకుంద నారదనుత
పద్మనాభాచ్యుత ప్రద్యుమ్న శ్రీధర వామన గోవింద వాసుదేవ
విష్ణోనిరుద్ధ త్రివిక్రమాధోక్షజ నారసింహ జనార్దన మధుసూద
న యుపేంద్ర సంకర్షణ పురుషోత్తమ హరే దామోదరానంత దానవాంత
యఖిల లోకైకనాథ దివ్యాంఘ్రిపద్మ
ములకుఁ బ్రణమిల్లెదను ముదములర నేలు
భద్రగిరివాస శ్రీరామభద్ర దాస
పోషబిరుదాంక రఘుకులాంబుధిశశాంక. ౧౦౭

జయ రఘుకులదీప జయ దశరథపుత్ర జయ భరతాగ్రజ జయ ముకుంద
జయతాటకాంతక జయమఖపరిపాల జయయహల్యాపోష జయయుపేంద్ర
జయ హరధనుఖండ జయజానకీనాథ జయ భృగుసుతభంగ జయకృపాబ్ధి
జయ వనసంచార జయ వాలిమర్దన జయ వార్ధిబంధన జయ మురారి
రావణాంతక సాకేతరమణ నీదు
వలన శతకము వినువారి వలన లుఘుగు
భద్రగిరివాస శ్రీరామ భద్ర దాస
పోషబిరుదాంక రఘుకులాంబుధిశశాంక. ౧౦౮

---

శ్రీ

# వరదరాజశతకము.

— కృష్ణకవిప్రణీతము —

రేఫప్రాసయుతచంపకమాలావృత్తములు.

---

సురనుత మంజుభాష వరసుందరవేష స్వభక్తపోష యా
సురమదశోష సర్వగుణశోభితభూష కృపావిశేష నే
శరణని వేఁడిన న్వినవు సాహసమా చలమా యిదేమి మం
దరధర కుందసుందరరదా వరదా మురదానవాంతకా. ౧

హరిహయుఁ డాదియౌ సురలకందనివాని విరించి మానులు
న్మొరలిడువాని దాసజనముఖ్యులఁ గొల్చెడువాని దీనులన్
సరగునఁ బ్రోచువాని నిను సన్నుతిసేతును నన్నుఁ బ్రోవు మం
దరధర కుందసుందరరదా వరదా మురదానవాంతకా. ౨

స్ఫురదరవిందనేత్ర యతిశోభనగాత్ర గిరీశమిత్ర సా
గరతనయాకళత్ర వరగర్వమదాసురజైత్ర భారతీ
వరనుతవక్త్ర యోగిజనవందితపాత్ర సువర్ణవస్త్ర మం
దరధర కుందసుందరరదా వరదా మురదానవాంతకా. ౩

గరుడతురంగ శత్రుజనగర్వవిభంగ రమాంతరంగ నే
మొరలనిడంగ నీ కదియు ముద్దా భుజంగశయాన నీకు నేఁ
బరుఁడనె మానిసంగ రిపువద్మచుతంగజ దోషహారి మం. ౪

నరసఖ దైత్యమర్దన నారదసన్నుత యప్రమేయ శ్రీ
ధర కరుణాపయోనిధి సుదర్శనసాయక వాసుదేవ సా
దరమతి నన్నుఁ బ్రోవఁగదె తాపసహృత్కమలాంతవాస మం. ౫

కరకరిఁ జూడ మేర యదిగాదు దయాపర నీదునామ మే
నిరతము సంస్మరించెదను నిర్మలుఁ డం చని ప్రోవకుండినన్
వరదుఁడ వన్నమాట కదివైవగునే తగునే రమేశ మం. ౬

సరసిజనాభ వామన ప్రసన్న నిను స్మరణంబు వేఁడినం
బరమకృపాకటాక్షమునఁ బారఁగఁ జూడ వదేమిచోద్యమో
హాఁహరి నీదుమానసము [illegible] నైతి మం. ౭

